# విజ్ఞాన వల్లరి



సంగ్రథకుడు :

గడియారం రామకృష్ణశర్మ



ప్రతాపరుద్ర పబ్లికేషన్స్
వరంగల్లు

# విజ్ఞప్తి



తెలంగాణమునకు తమ జీవితములను ధారపోసి దేశ భాషాసేవలుచేయుచున్న శ్రీఆంధ్ర పితామహులు, శ్రీఆదిరాజు వీరభద్రరావు, శ్రీ దూపాటి వేంకటరమణాచార్యులు, శ్రీ ఒద్దిరాజు సీతారామచంద్రరావు మొదలయిన పెద్దల విజ్ఞానదాయక వ్యాసము లిందు కూర్చబడినవి.

ఇది విజ్ఞానయుగము. నేడు ప్రపంచము వైజ్ఞానిక పథమున శరవేగముతో పురోగమించుచున్నది. నేటి మానవునకు అడుగడుగునను విజ్ఞానముతో నవసరమున్నది. దానిని గ్రహింపలేనివారు లోకవ్యవహారమున విజయమునందలేరు. విద్యార్థులకు అన్ని విధముల విజ్ఞానమవసరమై యున్నది.

ఈ దృష్టితో సాగించుచున్న మా ప్రయత్నమును లోకము, ప్రభుత్వము ఆదరించునని ఆశించుచున్నాము.

ప్రకాశకులు



# విషయానుక్రమణిక

# ధాన్యకటకాస్థానము

## శ్రీ దూపాటి వెంకటరమణాచార్యులు

ధాన్యకటకము నిప్పుడు ధరణికోటయని మనము వ్యవహరించుచున్నాము. ఈ కళాక్షేత్రము గుంటూరు మండలములో సత్తెనపల్లి తాలూకాయందు కృష్ణాతీరమున నున్నది. శ్రీ బుద్ధభగవానుని పవిత్రధాతు గర్భితమగు నీపుణ్యభూమిని స్మరించుట, చరిత్రాభిరుచి, లలిత కళాలాలసత్వము,కల ప్రతి ఆంధ్రుని విధి.

పూర్వము ధరణికోటపురము, ఆవలి కొసనున్న అమరావతియు, పరిసర భూములు ఆక్రమించుకొని మహానగరముగ నుండెడిది. కృష్ణాతరంగిణీ శీతల శీకరములచేఁ బవిత్రమైన యానగరము కాలక్రమమున నంతరించి, నామమాత్రావశిష్టముగాఁ గుగ్రామమయినది. అందలి మంటిదిబ్బల భేదించుకొని, అశోకచక్రవర్తి నాటి బౌద్ధస్తూపరాజములు లోకవిస్మయకరములగు శిల్పసంపదలతోఁ బ్రత్యక్షమైనవి. కళాకౌశలము నెరుగని స్థానిక జమీందారు వాసిరెడ్డి వెంకటాద్రినాయుడు ఆ స్తూపములోని పాలరాతి స్తంభములను, విగ్రహరాజములను సున్నము కాల్పించి, శిల్పసంపదకు దీరని కొరతఁ గల్పించెను. కర్నల్ మెకంజీదొరవారు ఈ స్తూప పరిస్థితిని లోకమునకు వెల్లడించి మహోపకారము గావించిరి. అంతలో చరిత్ర విదులయొక్కయు, కళావిదులయొక్కయు దృష్టి ధాన్య

కటకమువైపు మరలినది. పరిశోధనలు జరిగినవి. ఫలితముగా ధరణికోట ఆంధ్ర నృపాలురకు రాజధానియనియు, బౌద్ధులకు పవిత్ర క్షేత్రరాజమనియు, శిల్పములకు మూలకందమనియు, విశ్వవిద్యాలయములకు మాతృభూమియనియు స్పష్టమైనది.

బుద్ధభగవానుడు ఆనందుడను ప్రధాన శిష్యునితో బుద్ధులయొక్కయు, ప్రత్యేక బుద్ధునియొక్కయు, అర్హతుల యొక్కయు, చక్రవర్తులయొక్కయు, ధాతువులు నిక్షిప్తమొనరించి, చైత్యముల నిర్మించి పూజింపవచ్చునని యాజ్ఞ యిచ్చెను.

తరువాత అశోక చక్రవర్తి శ్రద్ధాభక్తులతో బౌద్ధమత ప్రచారమునకు వివిధవిధములగు కృషిచేసి కృతకృత్యుడయ్యెను. రాజ్యముగూడ విస్తృతమయ్యెను. బుద్ధుడు నిర్వాణము చెందినవెంటనే అతని ధాతువులు ఎనిమిది భాగములు చేసి, ఎనిమిది చైత్యములను నెలకొల్పిరి. అశోకుని కాలమున, దిగ్విజయములచే నాతని రాజ్యము స్వల్పకాలమున విస్తృతియయ్యెను.

బౌద్ధధర్మములు ప్రజలయందు విరివిగా నాటుకొనెను. అపుడు పూర్వోక్త చైత్యములనుండి, ఏడుతావులనున్న శారీరక ధాతువులను దీయించి, ఎనుబది నాల్గువేల శకలముల నొనరించి, మన రాజ్యమునందలి ముఖ్యస్థలములలో నెనుబది నాల్గువేల స్తూపములను గట్టించెను. అట్టి శారీరకధాతు చైత్యములలో ధరణికోటలోని దొకటిగ నుండునని విజ్ఞుల తలంపు. గౌతమీ పుత్ర శాతకర్ణుడు ధరణికోటయందు రాజ్యముచేసెను.

ఆతడు శూరుడు. సంగరములలో పరాజయము నెరుగని జెగజెట్టి. సింహాసనాసీనులగు రాజులు పశ్చిమాంధ్ర దేశము నేలుచు ప్రతిష్ఠానపురమున యువరాజ పదవి నలంకరించుచుండిరి. శాతకర్ణి తల్లి గౌతమియు, భార్యయగు వాసిష్ఠియు, బౌద్ధ ధర్మము ననుసరించి, బౌద్ధ భిక్షుక నివాసములకు గుహాలు తొలిపించియు, వారిపోషణమునకై భూములు, గ్రామములు నొసగియు తోడుపడుచు వచ్చిరి. గౌతమీపుత్రి శాతకర్ణి కుమారులలో వాశిష్ఠీపుత్రి శాతకర్ణుడే ప్రముఖుడు. శివశ్రీ శాతకర్ణికూడ కొన్ని దానములు కావించినాడు. నాగార్జునాచార్యుడీకాలముననుండెను. ఈతడు మహావిద్వాంసుడు. బౌద్ధ మతమునకుఁ గొప్ప తేజము ప్రశస్తి కలిగించిన ధన్యుడు. ఈయన ప్రత్యేక స్తూపము నిర్మించుటయేకాక, ధరణికోట స్తూపమునకు ప్రాకారము సర్వాంగసుందరముగ మనోహరముగ గట్టించి యున్నాడు. ఈ ప్రాకారముతో, దీని శిల్పసంపదతో తులదూగు ప్రాకారము ప్రపంచమున మృగ్యమను శిల్పకళారహస్య విదుల తలంపు సత్యమనుటకు సంశయములేదు.

ధరణికోట ప్రాంతమున సీసము, రాగి, వెండి, బంగారు నాణెములనేకములుగా, లభించినవి. అవి గౌతమీపుత్రి శాతకర్ణివిగా, యజ్ఞశ్రీ శాతకర్ణివిగా, చంద్రశ్రీ శాతకర్ణివిగా గుర్తింపబడుటచే వీరలందరును ధరణికోట సామ్రాజ్య పాలకులనియు స్తూపమునకు దానధర్మాదికములఁగావించిన వారనియు, బౌద్ధధర్మము గ్రహించిన లలితకళా ప్రియులనియు, గ్రహింపవచ్చును. ఇంతవరకు బరిశోధింపబడని స్తూపములు తెలంగాణమునందు, గంగాపురము, ఫణిగిరి,

ఏలేశ్వరము, వర్ధమానుకోట, పానగల్లు, నేలకొండపల్లి యందును, బలుతావులయందును గలవు. అవి సమ్యక్పరిశోధితములైనపుడు, ఆంధ్ర భృత్య వంశజుల చరిత్రము ఇంకను గ్రాహ్యముకావచ్చును.

ధాన్యకటకము ప్రకృతి విలాసముల కాటపట్టు. అందు సర్వవిద్యానిలయమగు నొక విశ్వవిద్యాలయము గలదు. నాగార్జునుఁడు, ఆర్యదేవుఁడు, మైత్రేయనాథుడు లోనగు విద్యావేత్తలు భరతఖండమందంతటను వ్యాప్తినొందు విద్యావైదుష్య బీజముల విరివిగా నాటిరి. వివిధ శాఖోపశాఖా విరాజితమగు బౌద్ధ మహావృక్ష మూలమిట గోచరింపదు. అద్వితీయ సౌందర్య నిలయమగు ధాన్యకటకమందలి ప్రధాన స్తూపమునకు మహాచైత్యమని పేరు. దాని చేరువలో దాన చైత్యములు చాల పెంపొందినవి. ఈ క్షేత్రరాజము సుప్రసిద్ధ యాత్రాస్థలముగ నుండి బౌద్ధయాత్రికులకును; విద్యానిలయముగ నుండి మహావిద్వాంసులకును ఆశ్రయ మిచ్చుచుండెడిది. అందుచేతనే వేరువేరు సాంప్రదాయముల కనుకూలముగా సంఘారామములు, ప్రత్యేక వ్యక్తులచే నిర్మింపబడుట యిచటి శాసనములలోఁ గాంచనగును. శక, పహ్లవ, యవనాదులు బౌద్ధనామములుదాల్చి బుద్ధుని సేవించి దాన ధర్మాదికముల గావించిరను శాసనములు ధాన్యకటకమున గలవు.

సర్వమత సమ్మేళనమునకు బౌద్ధమతము దారిజూపె ననుట కంతకంటె దృష్టాంతమేల?

ఆంధ్రరాజుల కాలమున రాజకీయభాష ప్రాకృతము. ఆంధ్రరాజులు ప్రాకృత గ్రంథరచనమునకు దోహద మొసంగిరి. గుణాఢ్యపండితుని బృహత్కథయు, శర్వవర్మ కాతంత్ర వ్యాకరణము, హాలుని సప్తశతియు, నీ విషయమున నుదాహరణముగ దీసికొనవచ్చును. ఇంక నెంత ప్రాకృతవాఙ్మయము నశించెనో తెల్పవశముగాదు. శిల్పమున అప్పటివారు అందె వేసిన చేతులు, హారములందలి పూసలు, ఎముకలతోడను, దంతములతోడను, కెంపులతోడను, రాళ్ళలోని వివిధ వర్ణములుగల వానితోడను జేయుచుండిరి. కుంభములపై వివిధ వర్ణములు వేసి చిత్రవిచిత్రములగు లతాంకములతో నిర్మించుచుండిరి.

సముద్రవ్యాపారము చేయుచుండిరి. స్త్రీలు విద్యావతులై భర్తలతో సమాన గౌరవప్రపత్తుల నొందుచుండిరి. మొత్తముమీద ఆంధ్రరాజుల కాలమున, నృత్తము, గానము, పశుపోషణము, కర్షకజీవనము, మతపరిచారము, విదేశయాత్రికాగమనము, ఇతర దేశ సంబంధము, స్వయంసమృద్ధముగ నుండెననుటకు, చాలినన్ని యాధారములు గలవు.

అశోకుడు స్థాపించిన ధాతువువల్లనే ధాన్యకటకమునందలి స్తూపమునకు ప్రఖ్యాతి గలిగియుండును. అశోకుని యాజ్ఞ గైకొని మతప్రచారమునకై బయలుదేరిన మహాదేవభిక్షువే, రాజావలంబమున నీచైత్యము నిర్మించి యుండవచ్చును.

నాగార్జునుని కొండయందును, భట్టిప్రోలునందును, బుద్ధుని ధాతువులుంచి, చైత్యముల నిర్మించిరి. నాగార్జునుడు

సుందర ప్రాకారము నిర్మించుటవలన ధరణికోట మహాచైత్య మునకు పేరుపెంపులు గలిగియుండును.

ధాన్యకటక స్తూపము అనంత శిల్ప విశ్వకోశము, స్త్రీ విగ్రహ కల్పనము ఇందు సార్వత్రికముగ అభంగిమ రూప ముతో నుండును. అవయవ విజృంభణము, పొట్ట ముడుతలు, తొడల నాజూకుతనము ప్రకృతి సిద్ధముగు రూపవిన్యాసముతో నిర్మించుటలో శిల్పి అద్వితీయుడు. కేవల సౌందర్యదర్శియగు శిల్పి, తన సృష్టిలో నగ్నరూప రచనము, దోషముగ భావింపడు. అయినను ఈ వస్త్రాచ్ఛాదనముచే గుహ్యావయవముల మరుగుపరచి తన కళాకౌశలముచే సౌందర్యవంతముగ విలాసినుల జిత్రించుట ధాన్యకటక చిత్రరచనలో విశేషము.

నాట్యమున స్త్రీ పురుషు లిరువురు సమాన ప్రాగల్భ్యము గలవారుగ శిల్పి చిత్రించెను. ఒక్క స్త్రీ పురుషులే కాదు, దేవతాగణముగూడ నృత్యనైపుణ్యము జూపుచు, భావ విలసనముగ నాట్యము చేయుట, బౌద్ధశిల్పి జూపు కళా కౌశలము. గానకౌశలము ప్రదర్శించుట, శిల్పి కసాధ్యమైనను ధాన్యకటక శిల్పములలో జంత్రగాత్ర సంగీతమునగూడ నేర్పు ప్రదర్శించు స్త్రీ పురుషుల జిత్రించినాడు. వేణువు, చితారు, మద్దెల, ఢక్క లోనగు వాద్యవిశేషముల నుపయోగించుటయు చూడ, ఆకాలమున సంగీతాభినయములలో స్త్రీ పురుషుల కెంత యభిరుచి యుండెనో తెలిసికొనవచ్చును. ప్రకృత కాలమున వాడుట యెరుంగని సుకుమారములగు సంగీత నాట్యసాధనము లెన్నియేనియు. చిత్రములలో గానవచ్చును.

ధాన్యకటక స్తూపమున యుద్ధచిత్రములు! కొన్ని గలవు. చతురంగబల సమేతముగ యుద్ధయాత్రలు చేయుట పలు తావుల చూపబడినది.

రథములకు రెండు గుర్రముల గట్టువారు. ద్విచక్ర శకటములే రథములు. పైన శిఖరరూపముగ ఆచ్ఛాదన యుండును. రథికుడును సారథిమాత్రమే కూర్చొని యుందురు. కొన్ని సామాన్యముగ అవసరములలో రెండెద్దులబండిని గూడ యువరాజు మొదలగువారు ఎక్కి ప్రయాణము చేయుటయు గలదు. ఇట్టి చిత్రములు సమకాలికములగు ఇతర చిత్రములలోగూడ గన్పట్టును. ఈటె, బల్లెము, ధనుస్సు, బాణములు, డాలు, ఖడ్గములు ఆకాలపు ఆయుధములు.

బుద్ధుని పాదములుంచి పూజించు పూజాగృహములు గంధకుటులనియు, పుణ్యశాలలనియు వ్యవహరింప బడును. వానిపై శిఖరములుండును. వృత్తాకారముల నీగృహమున్నచో నొక శిఖరము, చతురస్రముగా నున్న నాలుగు శిఖరములుండును. కొన్నియెడల నంత కెక్కుడుగూడ నుండుటగలదు. మహానసశాలలకు, భిక్షుక గృహములకు గవాక్షులు అర్ధవర్తులాకారముగా నుండును. పూరిగుడిసెలు మొదలు అంతస్తులుగల మేడలవరకు నీ గృహములలో వివిధ భేదములుండును.

వేషభాషలలో జాలతెరగులు గోచరించును. రాజులు కిరీటముగాని భూషణాలంకారముతోనున్న తలగుడ్డగాని దాల్తురు. వివిధములగు కర్ణభూషణములును, కడియమును, హారములును ధరించువారు. సామాన్యులుమాత్రము కిరీటము దాల్పరు. అందచందములుగ తలగుడ్డ దాల్తురు. వివిధములగు

భూషణము లుపయోగింతురు, బౌద్ధసన్యాసులు ముండిత శిరస్కులు. జందెపు వైఖరిగ కంఠమునుండి పాదములవరకు వస్త్రములు ధరింతురు. యుద్ధవీరులకు శిరస్త్రాణములు, చల్లడమువలె వెనుకకు విరిచిగట్టిన వస్త్రధారణమున్నది. నడుములకు కాశికోకలు దాల్తురు.

రాజాస్థానములలో విదేశపు రాయబారులు, సంధి రాయబారములు తెల్పుచిత్రములు రమణీయములు. మోకాలు వరకున్న అంగరకాలు, వింతగొలుపు ఉష్ణీషధారణము పొడవైన శిరోవేష్టములు, చూచినవిదేశీయుల చిత్రములని చెప్పవచ్చును.

స్త్రీల సహజవిలాసముల ప్రకృతిసిద్ధముగ నిర్మించుటలో బౌద్ధశిల్పులు అసమానకౌశల్యము జూపిరి. వివిధములగు కేశాలంకారములు గావించుటలో స్త్రీలు నేర్పరులు. వారినాగరికత అసామాన్యము. ఉరోజములపొంకము గనిపించుటకై హారములను గుత్తముగ ధరించుటగలదు. స్త్రీల వస్త్రధారణము విలక్షణమైనది. వారి అలంకారమును ప్రశస్తము. మొత్తముమీద ధరణికోట స్తూపములో ఆంధ్రుల వేషధారణము ముఖ్యముగా గమనింపదగినది. ఆంధ్రసంస్కృతినిగూర్చి ప్రాచీన చరిత్రము ధాన్యకటకమున విరివిగా లభించును.

కోట కేతరాజు క్రీ॥శ॥1182లో బుద్ధదేవుని పూజార్థము కొన్ని గ్రామము లొసంగినట్లు అమరావతిలో నొకశాసనమున చెప్పబడినది. ఇంతియేకాక అతని యుంపుడు కత్తెలగు, సూరమ, పోలమ, దేవులును, బుద్ధదేవుని దీపారాధనకును, అతనిభార్యయు, కాకతి గణపతిదేవుని మేనకోడలగు

బయ్యాముయు బుద్ధపూజకు గోవులనొసంగుటయు, గమనింపదగ్గ విషయము. ధరణికోట నేడు తన చరిత్రప్రశస్తిని కడుపులో పెట్టుకొన్న దిబ్బలతోడను, తిన్నెలతోడను నిండియున్నది. ఆకాలమున నాంధ్రసామ్రాజ్యము దక్షిణమున మైసూరు మొదలుకొని యుత్తరమున గంగానదివరకు వ్యాపించెను. ఆంధ్రరాజులు సత్పరిపాలనముచే ప్రజాహృదయములు చూరగొనిరి.

స్తూపరక్షణమునసేకాక ఆంధ్రనృపాలురు కొండలలో గుహాలు దొలిపించి బౌద్ధభిక్షుకులకు మఠములు నేర్పాటు చేసిరి. ఆంధ్రేతర ప్రాంతములందేగాక ఆంధ్రప్రాంతములలోగల బెజవాడ, ఆఱుగొలను, మొగలురాజపురము. శ్రీశైలము, గుంటుపల్లిగుహలు, బౌద్ధభిక్షువుల నివాసములకొరకు దొలుచబడినవి. వీని పోషణ భారమును గ్రామసంఘములు భరించుచుండెడివి.

ఆ కాలములో ప్రజలు కళాప్రియులుగ నుండిరి. ప్రతి పౌరుడు బౌద్ధధర్మమందు విశ్వాసముకలిగి, సద్వర్తనుడై రాజభక్తుడై యుండెను. చిత్రకళయందు అభిమానము గలిగి నిరుపమానమైన త్యాగముచూపిన పౌరులతోడనే లోకోత్తరమగు ధాన్యకటకస్తూపము వెలుగొందినది. రాజు మొదలు సామాన్యపౌరునివరకును బుద్ధదేవుని భక్తులైనట్లు మహాచైత్యములలోని శాసనములవలనను చిత్రములవలనను గ్రహింపవచ్చును.

ధాన్యకటకమునందలి దీపాలదిన్నె దొరతనమువారు త్రవ్వించి విలువగల శిల్పములను వెలికిదీసి కళాగౌరవము

ఇనుమడింపచేసిరి. ప్రధానచైత్యము బుద్ధభగవానుని ధాతువులు గలది. యీ స్తూపమునుండి ధర్మచక్రములు, బౌద్ధజాతక కథలుగల శిల్పములు, వివిధములగు ఆకృతిలోనున్న బుద్ధ విగ్రహములు, వివిధావస్థలలోనున్న మనుష్యవిగ్రహములు, చలువరాతి పలుకలు, శాసనములు, స్ఫటికస్తంభములు మొదలగు శిల్పశోభితములగు శిలాభాగములు పైకి తీయబడినవి. స్తూపము మంచిదశలో నున్నప్పుడు రాత్రులందు ప్రాకారమునకును, శిఖరములకునుదీపాలంకారములు పరిజలు చేయువారు గావున, ఈ మహాస్తూపమునకు దీపాలదిన్నె యను నామము వ్యవహారమునకు వచ్చియుండును.

ధాన్యకటక రాజులు లలితకళాప్రియులు. బౌద్ధశిల్పులు కళాసార్వభౌములు. వారిశిల్పము మీగడవంటి పాలరాళ్ళపై నిర్మింపబడినది. బుద్ధుని ప్రేమ ప్రసన్న సుస్వరూపము మొదలు ఆయన జీవిత చరిత్రమునంతయు అనన్య కౌశల్యముతో అమృతమయహస్తములతో జెక్కి ప్రజాకర్షణము గావించిన యీ శిల్పావతంసులనేర్పు వెలఁబెట్టరానిది. బౌద్ధయుగముననే శిల్పకళ సర్వోంకషము, సౌందర్యనిలయము, చాతుర్యధుర్యము అయినది. అంతటి హస్తకౌశల్యము నెటు లలవరించికొనిరో! ధరణికోటలోని చిత్రశిలలు చాలావఱకు సున్నముగాల్చి రూపుమాపిరి. స్థానికులు ముగ్గునూరుట కుపయోగించుచున్నారు. విలువగల శిల్పములు చాలావఱకు లండను పట్టణమునకు జేర్చబడెను. హతశేషములలో కొన్నిటినిమాత్రము కలకత్తా, మద్రాస్, హయిదరాబాద్ వస్తుప్రదర్శనశాలలలో భద్రము చేసి దొరతనమువారు రక్షణోపాయము నారయుచున్నచో

స్తూపచరిత్రము విస్మృతమైనటులే, విగ్రహవ్రాతముగూడా అదృశ్యమై యుండును.

కళానిలయమని ప్రశంసింపదగు ధాన్యకటక రమణీయ శిల్పమునకు శిరమువంచి యొక్కమారు జోహారు గావించుట ప్రతి ఆంధ్రుని కనీసధర్మము.

ఓం శాంతిః శాంతిః శాంతిః

# విశ్వవ్యాపిత హిందూసంస్కృతి

## శ్రీ శ్రీధర రామనాథ శర్మ

వేలాది వర్షములనుండి వచ్చుచున్న క్రమానుగతమగు ఆచారముల నిర్ణయములపై సంస్కృతీ నిర్మాణమగును. అందుచే ఏదేని సంస్కృతి, ఉదయకాలమును లెక్కించుటగాని ఊహించుటగాని సులభకార్యము కాదు. మానవుని ఇతిహాస దృష్టి ప్రాచీనపరిధిని లంఘింపజాలదు. అనేక కష్టములున్నప్పటి కిని, ప్రామాణిక పురాతత్వ శాస్త్రజ్ఞుల కృషివలన, వేల ఏండ్లకు పూర్వము ప్రపంచమంతటను హిందూసంస్కృతి వ్యాపితమైయున్నట్లు చెప్పవచ్చును. ప్రపంచములో మన సంస్కృతి చిహ్నములు ప్రశాంత మహాసాగరము (పసిఫిక్) నందును, అట్లాంటిక్ మహాసముద్రము, అందులకు సంబంధించిన మహాద్వీపములయందునుగలవు.

విశ్వసంస్కృతికి సూత్రధారులైనవారికి, మధ్యఏసియా నివాసస్థానముగ నుండినదని, అచ్చటి ప్రవాసులే సంస్కృతికి బీజారోపణ జరిపియుండినారని, వారు తొలుదొల్త మిశ్రదేశ మును కార్యస్థానముగ నేర్పరచుకొని యుండినారని, అచటి నుండి చతుర్దిశలా వ్యాపించినారని మనము దృఢముగ నమ్మనచో—ప్రాక్ దిశగ విజయయాత్ర సాగించుచూ సశ్య శ్యామలమైన బంఘూనది ఒడ్డున అధికారము నిలుపుకొన్న ప్రవాసుల, సమృద్ధ సంస్కృతి కాలాంతరమున ప్రపంచపు వివిధ మహాద్వీపములలో వ్యాప్తమైనదని మనము

నిస్సంకోచముగ చెప్పవచ్చును. సర్వాంగసుందరియైన వారి సంస్కృత భాషాదేవి ఇతర దేశభాషాకోశములకు మాతృ స్థానము నలంకరించినది. వారిలోని తాత్వికులు తమ అలౌకిక ఆధ్యాత్మిక విద్యాప్రభావ ప్రకాశములచే ప్రపంచమును విస్మయమంద జేసినారు. వారి లాక్షణిక కళాకృతులు జగత్ ప్రసిద్ధమైన రాజప్రాసాదములలో, లోకావాసములలో, ధర్మ మందిరములలో ప్రతిష్ఠింపబడి పూజనీయమైనవి. పరంపరానుగతమగు వారి ఇతిహాసము అన్ని దేశములందు ఆదరణీయమై అభిమానప్రదమైనది. వారు విశ్వసంస్కృతికే విశ్వకర్మలని నుడువుచు ధన్యవాదములర్పింపవలయును.

ప్రకృతము విశ్వవంద్యమైన విశ్వసంస్కృతీ దేవత సంపూర్ణకథను సపరిపూర్ణముగ విపులీకరించుటకు స్థానము లేదు. అయినను పాఠకులకు ఒక విశ్వాసమును మాత్రము గలిగింపవచ్చును. అదేమన దిగ్దిగంతవ్యాపితమైన హిందూ సంస్కృతేతిహాసము దృఢమైన ప్రామాణికములచే కూడి యున్నది. పాశ్చాత్య ఇతిహాసకులు గూడ ఈ నగ్నసత్యమును ఏకకంఠముతో అంగీకరించియున్నారు. ఈ వ్యాసములో పొందుపరచిన దేశములందేగాక, వాటి ఛత్రఛాయలయందున్న దేశములు కూడ హిందూసంస్కృతి ప్రభావమును పొందగలిగినవి. ప్రసంగవశమున కొన్ని దేశముల మాత్రమే ఇచట ఉదహరించుచున్నాను.

# అమెరికాలో హిందూసంస్కృతి

ఆటంబాంబుబలముపై యావత్తు ప్రపంచమును తమ కైవసం చేసుకొన్న నేటి అమెరికనులు, ఒకానొక కాలములో హిందువులు తమ సంస్కృతీ బలముచే అమెరికాలో విజయయాత్ర సాగించినారను వార్తను నమ్మలేరు. వారి సాంస్కృతిక బలము నేటి ఆటంబాంబు శక్తికన్న వేలరెట్లు ప్రభావవంతమై యుండినది. ఈ సాంస్కృతిక విజయసాధనకై హిందూసంస్కృతికి సంబంధించిన అగ్రదూతలు మానవరక్తమును బలిపీఠముపై ప్రవహింపజేయవలసిన అవసరముండినది కాదు. వారి ఆధ్యాత్మిక జ్యోతిప్రకాశము నలుదిశల క్రమ్ముకొని యుండినది.

అమెరికను ఆదివాసుల సంస్కృతికి ప్రాచీన హిందువుల సంస్కృతికి గల సామ్యమును ఐతిహాసికులు చాలశ్రమచే అన్వేషించి ప్రకటించి యున్నారు. కొలంబసు అమెరికాను పెట్టుటకు వేల ఏండ్ల పూర్వమే హిందూ సంస్కృతి అచట పాదప్రవేశము జేయుటయే గాక సుస్థిరముగ సంఘటితమై యుండినదనుటకు చరిత్రాత్మకమైన ప్రమాణములు ఎన్నియో గలవు. ప్రాగైతిహాసిక కాలపు హిందువులు ఉపనివేశ స్థాపకులేగాక గొప్పవ్యాపారస్తులుగ, దేశసంచారులుగ నుండెడి వారు. సూర్యవంశజులగు హిందూరాజులు ఆసియా, యూరోపు, అమెరికా దేశములలో విశాల రాజ్యములను స్థాపించియుండిరి. మెక్సికోను నిర్మించుటలో భారతీయులే ముందంజవేసినట్లు ఆదేశపు ఇతిహాసములో స్పష్టముగ వ్రాయ

బడినది. అమెరికా దేశపు "మయ" జాతివారిలో భారతీయుల ఆచార వ్యవహారముల ప్రభావము పరిరక్షితమగును. అచట హిందూపౌరాణిక దేవతలగు సూర్య, గణపతి, ఇంద్రాది దేవతల విగ్రహములు బహుళముగ గలవు. భాషాసామ్యము, శిశునామవిధానము, పౌరోహిత్యపుశైలి, వివాహాది కార్యముల పద్ధతులు, అంత్యేష్టి క్రియలలోని పరస్పర సమానత్వము మెక్సికోలో చాల ప్రధానముగ నున్నవి. వీటిని గమనించిన వారు అమెరికాతో హిందువులకు సాంస్కృతిక సంబంధము లేదని చెప్పుటకు సాహసింపలేరు. భారతదేశమునుండి మెక్సికోకు మార్గముగూడ ఉన్నదా? యను ప్రశ్న గలదు. మొన్న మొన్ననే మెక్సికో, భారతదేశములమధ్య సాముద్రిక మార్గము గలదని అనుసంధాతలు ప్రకటించియున్నారు. మహాభారత యుద్ధములో అమెరికావాసులుగూడ పాల్గొనినట్లు ఇతిహాసము ఋజువు జేయుచున్నది. అర్జునుడు అమెరికావాసియగు ఉలూపి యను రాజకన్యను వివాహమాడియుండెను. ఆకాలములో అమెరికా, పాతాళలోకమని, సువర్ణ భూమియని వ్యవహరింప బడుచుండెను.

అచట హిందూ సంస్కృతీ చిహ్నములు అడుగడుగున అగుపించును. కృత, త్రేత, ద్వాపర, కలియుగములను నాల్గు యుగముల కల్పన హిందువులకున్నట్లు అచటివారికిగూడ నుండినది. దక్షిణ అమెరికాలోని ఇనా్క-జాతివారలలో, హిందువులలోని వర్ణాశ్రమ ధర్మములకు సరిబోలు జాతి విభాగముండినది. అచట శివలింగపూజకూడ చేయబడుచుండి నది. గ్రహణ సమయములలో గ్రహవిముక్తికై భారతీయులు

జేయుకోలాహలము, ప్రార్థనలు అటకూడ జరుపుచుండెడి వారు. శరీరమును కృశింపజేసి వశీభూతము జేసికొను తపస్సులుకూడ వ్యాప్తిలో నుండినవి. ధార్మిక మనోరంజకములకై జేయునృత్యముల పద్ధతులు భారత దేశమునకు చాలసమీపముగ నుండినవి. ప్రాచీన మెక్సికోవాసులు, భారతీయులవలెనే కట్టెల రాపిడివలన గలిగిన పవిత్రాగ్నిని పొందుచుండిరి. సోమయజ్ఞమునకు సరిపోలు ఒక యజ్ఞమును ఉత్తర అమెరికా యందలి ఆదివాసులు జేయుచుండిరి. వారు ఆత్మకు అమరత్వమును, మరణానంతరము పునర్జన్మను విశ్వసించెడివారు. మెక్సికో, పీరూ రాష్ట్రములందు నేడుగూడ రామరావణ యుద్ధము ప్రదర్శింప బడుచున్నది. అంతవరకేగాక దసరా ఉత్సవములు కూడ జరుపబడుచున్నవి. అమెరికా యందలి ఆదివాసుల భోజనపద్ధతి మనపద్ధతి వలెనే యున్నది. రొట్టె, పప్పు పదార్థములే గాక మన దేశమునందలి తినుబండారములు అచటగూడ తయారగుచున్నవి. భారతీయులవలె వారుగూడ అంధ విశ్వాసము గలవారే? ఏదైన పనిపై బయలుదేరునపుడు దారిలో సర్పము, నక్క ఎదురుపడిన అపశకునముగ తలచెదరు. భారతీయులవలెనే వారిలో కూడ ఆధిభౌతిక శక్తుల యందు శ్రద్ధాసక్తులు కలవు.

## బర్మాలో హిందూ సభ్యత

ప్రాక్ సీమాంతమున నుండు బర్మా దేశేతిహాసము వైపు మనదృష్టి మరల్పవలయును. "బ్రహ్మ" యొక్క

అపభ్రంశపు నామమగు "బర్మా" యే దీనిపైగల ఆర్య సంస్కృతీ ప్రభావమును సూచించుచున్నది. ఈ దేశమున బౌద్ధకాలపు అన్వేషణయే ఎక్కుడుగ జరిగియున్నది. వైదిక కాలపు స్మారకములు ఎక్కుడుగ లభించుటలేదు. అయినను బౌద్ధ ధర్మమునకు సమానమైన రాజధర్మము లేసప్పటికిని హిందూమతము బర్మాలో వందలాది సంవత్సరములు వ్యాప్తిలో నుండినదని చెప్పవచ్చును. అంతేగాక బౌద్ధమతము విస్తరించుటకు పూర్వమే హిందూ సంస్కృతీ ప్రభావము బ్రహ్మ నివాసుల జీవన సభ్యతల యందు గట్టిగ పాదుకొని యుండినది. క్రీ. పూ. 850 సంవత్సరముల క్రిందట శాక్య వంశజుడగు అభిరాజనువాడు తొలుదొల్త అచట పాద ప్రవేశము జేసినట్లు ఒక కింవదంతి గలదు. అతని తర్వాత 250 సంవత్సరములకు సింధూ, గంగా మైదానమునుండి దశ రాజనువాడు వెళ్లి అభిరాజవంశజులను ఓడించెను. ఆ వంశజులే నేటి ప్రోము ప్రాంతమునకు సమీపమున శ్రీక్షేత్రమను పేరుతో రాజ్యస్థాపన జరిపినారు. బర్మా సంబంధము ఉత్తర భారతములో ఆసాము, అరాకానుల మీదుగ నుండినది. దక్షిణముగ కళింగ, ఆంధ్ర, పల్లవములతోను, చోళదేశము బర్మాదేశపు పశ్చిమ దక్షిణతీరములతో సంబంధము గలిగి యుండినది. బర్మాదేశ భాషపై, పాళీ, సంస్కృతభాషల ప్రభావము ఎక్కుడుగ ఉన్నది. ఈ దేశపు, సాహిత్య, వ్యాకరణ, ఆయుర్వేద, జ్యోతిషమాదిగా గలవానిలో హిందూ సంస్కారపు చిహ్నములు ఎక్కుడుగ అగుపించు చున్నవి. మన రాములవారు వారికి కూడ సమ్మాన్యులే.

అచటిరాజులు, తాము రామవంశజులమని చెప్పుకొని ఎంతో గర్వపడువారు. పేగూ దేశపు శ్వేమాడ, రంగూనునందలి శ్వేడగాన్, థాటన్ నందలి శ్వేజియాన్ పెగోడాలు పూర్వము హిందూ మందిరములుగ నుండినవని విద్వాంసుల మతము గలదు. విష్ణువు, పార్వతీ, శివుడు, ఆంజనేయస్వామి, గణపతి, బ్రహ్మ మొదలుగాగల హిందూదేవతలు వారికి కుల దేవతలుగ నుండిరి. దక్షిణ బర్మాలో శ్రద్ధగ పరిశీలించి త్రవ్వించినచో ఇంకను ఎన్నియో లభించగలవు. హైలాంగు క్వ్యాంగు నందలి పురాతన మందిరము పూర్వము విష్ణ్వాలయముగ నుండినదట. నేడది జీర్ణదశ యందున్నది. అందులోని ముఖ్యమూర్తియగు గరుడవాహనారూఢుడైన విష్ణు విగ్రహము నేడు బెర్లిను పట్టణములోని మ్యూజియములో నున్నది.

## ఇండోచైనాలో హిందూసంస్కృతి ప్రభావము

ఇండో చైనాలో హిందూ సంస్కృతి ప్రవేశము ఎప్పుడు జరిగినది సక్రమముగ తెలియుటలేదు. ఫూనాన్ దేశపు రాణి సముద్ర యుద్ధములో పరాజయము పొంది, కౌండిన్యుని శరణు జొచ్చినట్లు ఆ దేశపు రాజకీయ లేఖనములలోగలదు. కౌండిన్యుడు ప్రతాపవంతుడగు బ్రాహ్మణుడు. ఆతడు ఈమెను వివాహమాడి వస్త్రదానము గూడ జేసినట్లుగలదు. పల్లవ రాజగు స్కంధశిష్యుడు, ద్రోణపుత్రుడగు అశ్వత్థామకు నాగ కన్యకు గలిగిన సంతానమని ఒక కింవదంతి గలదు. ఇండో చైనా, జావా, బోర్నియో దేశముల ఆరంభ రచనలు పల్లవ

గ్రంథ లిపిలోనున్నవి. అందు కాంబోడియా, అసాము, బోర్నియో, జావా మొదలగు దేశపు రాజుల దాష్ట్యము బర్మాపై యున్నట్లు తెలుపబడినది. కొద్దిరోజుల క్రితము కాంబోడియా చరిత్రసంబంధమైనరచన చూచి యుంటి ని. దానిలో మొదటిభాగము నశించియుండెను. రెండవభాగ ములో నీవిధముగ వ్రాయబడి యుండెను. "గుణవర్మ పృథ్విలో భగవంతుని పాదచిహ్నముల స్థాపించెను. అష్టమ దివసమున, వేద, వేదాంగ నిష్ణాతులగు బ్రాహ్మణులు దానిని ప్రతిష్ఠించిరి. ఋషీశ్వరులు దానిని చక్రతీర్థ స్వాములని ఘోషించిరి." అందులోని అంతిమ వాక్యములలో "గుణవర్మ భగవంతునికి అర్పించిన సంపత్తి యంతయు పవిత్ర భాగవతోత్తములకు సంబంధించినది. ఆ నిధిని రక్షించినవారు తప్పక విష్ణులోక సుఖములకుఅర్హులగుదురు." చీనాదేశపుచరిత్రలో కౌండిన్యుని వంశజుడగు యజవర్మ ఆదేశపు రాజదర్బారునకు ఒక భిక్షుకుని పంపినట్లు వ్రాయబడి యున్నది. అతడు దర్బారులో "మా దేశములో భగవంతుడగు మహేశ్వరుని మత్రము ప్రసారిత మగుచున్నది. ఈ పవిత్ర భూమియందు భగవంతుని శక్తి అవతరించి ప్రపంచమంతట శాంతి ప్రసాదించును." కాంబోడియా నామము కాంభోజమను సంస్కృత శబ్దపు ఆంగ్లవికృతరూపము. కాంభోజము కంబుఋషి భూమియై యున్నది. ఈ ఋషివంశజులలో, భావవర్మ, మహేంద్రవర్మ, ఈశానువర్మయను రాజులు చరిత్రలో ప్రసిద్ధి జెందినవారు. కాంభోజదేశపు శిలాలేఖనములు స్పష్టములుగ సంస్కార యుతములుగ నున్నవి.

# మధ్యఆసియాలో హిందూసంస్కృతి విస్తారము

ఇస్రాయిలు, దేశమునకు భారతసాంస్కృతిక సంపర్కమునకుగల సంబంధము, కింవదంతులతో - కథలతో గూడి యున్నది. భారత దేశములో ప్రసిద్ధమైన నహుష చరితము హిందూమతమునకు సంబంధించి యున్నది. నహుషుడు పౌరాణికయుగ ధార్మికరాజు. అతడు గుణసంపత్తిచే ఇంద్రత్వముగూడ పొందగలిగినాడు. తదుపరి మదోన్మత్తుడై భృగు, అగస్త్యాది మహామునులచే పల్లకీ మోయించినాడు. అంతటితో పోనీక పల్లకి త్వరితముగ వెళ్ళవలయునని తలచి, వారిని కాలితో తన్ని అవమాన పరచినాడు. అందుపై అగస్త్యుడు ఆగ్రహించి నహుషుని సర్పముగ శాసించెను. నహుషునకు సర్పాకారము ప్రాప్తించెను. నాటినుండి నహుష శబ్దము సర్పమునకు లాక్షణికరూపము పొందినది. హిబ్రూభాషయందు సర్పమునకు "నహాస్" అనియెదరు. ఇథియోపియా భాషలో "N" అక్షరమును నహాస్ అనియెదరు. ఆ అక్షరము సర్పాకారముగ యున్నందున దానికాపేరు వచ్చినదనెదరు.

నహుష చక్రవర్తి సర్పాకారమును పొందినట్లు కథ ప్రారంభమైనప్పటి నుండియే యూదులు నహుష శబ్దమును వాడుకలో దీసికొనినారు. నహుషుని కథ, హిబ్రూభాష యందలి నహాస్ శబ్దముల వలన హిందువులకు యూదులకు సన్నిహిత సాంస్కృతికి సంపర్కము ప్రకటిత మగుచున్నది.

పదిపండ్రెండు వేల ఏండ్లక్రిందటి ప్రాగైతిహాసిక భావనలుగల చిత్రములు స్పైనునందును,ఫ్రాంసునందలి ఆల్టామీరా

గుహల యందును లభించినవి. అచటి పూర్వపు నివాసుల చిత్రములకు, స్పైనునందలి చిత్రములకు చాల సన్నిహితత్వము గలదు. రెండింటి యందును మూలప్రవృత్తి ఒకటిగనే యున్నది.

ఇదేవిధముగ మధ్యఆసియాలో, దక్షిణాఫ్రికాలో దొరకిన పాషాణ బంధములపై గల ఆకృతులకు సరిపోలునవి మాళవములో గూడ గలవు. హిందూసంస్కృతి ఒకనాడు సార్వభౌమత్వము సంపాదించినట్లు ఎక్కువ ప్రమాణములు దొరకగలవు.

ప్రపంచ చరిత్రలో సంస్కృతీ సామ్రాజ్యములు అనేకముగ విస్తరించినట్లు ఎన్నియో ఉదాహరణములు లభించును. కాని ఇంత విస్తారముగ ఏ సంస్కృతిగూడ విస్తరించి యుండలేదనవచ్చును. పరంపరానుగతముగ లభించుచున్న ఈ గౌరవమును మరల మనము పొందవలయుననుటయే ధ్యేయముగ నుండవలయును. నేటి మనప్రభుత్వము క్రమానుగతమగు పురాతనవిషయములపై ఉదాసీన భావము కలిగియున్నది. ఇది దేశదౌర్భాగ్యము. ఈ దౌర్భాగ్యమును తలక్రిందులుగ జేయవలసియున్నది. ప్రాచీన గౌరవముపైననే నూతనత్వము నిర్మాణమగును. ఈ చిరంతన సత్యము విస్మరింపదగినదికాదు.

# కోలములు - వారి భాష

~~~೦(త)೦~~~

ఆంధ్ర పితామహ

## శ్రీ మాడపాటి హనుమంతరావుగారు

హైదరాబాదు రాజ్యమందున్న ఇంచుమించు ఒక కోటి అరువది లక్షల జనులలో ఆటవిక జాతులవారు దాదాపు ఏడులక్షల మంది కలరని 1941 సం॥ జనపరిగణన నివేదిక యందు చూపబడినది. వీరిలో "ఆదిమనివాసులు" లేక "ఆదివాసు" లనబడు వారి సంఖ్య రెండులక్షల ఏబదివేలు. మిగిలినవారు దాదాపు నాలుగు లక్షల జనులు- బంజారీలు, లంబాడీలు, ఎరుకలు అను తెగలకు చెందినవారై యున్నారు.

ఆదివాసు లనువారిలో పలు తెగలుగలవు. వారి పేర్లు:- గోండులు, కోయలు, చెంచులు, కోలములు మొదలగునవి. అట్టి వారిలోని తుది తెగయగు కోలములను గురించిన యంశములను, వారిభాష, వ్యాకరణములనుగూర్చిన సంగతులను తెలిసికొనుట పాఠకులకు వినోదమును, విజ్ఞానమును సమకూర్చగలవు.

"కోలము" తెగవారు భారతదేశములోని మధ్యపరగణాలలోను, బిరారులోను నివసించుచున్నారు, 1931 లో కూర్చబడిన ప్రభుత్వమువారి లెక్కల ప్రకారము, ఈ తెగవారి మొత్తము సంఖ్య 31,713. వీరిలో ఒక బిరారు ప్రాంతమందే వీరు 29,515 మంది యున్నారట! ఆ ప్రాంతములోని
~~~

"యోతమాలు" జిల్లాలోనే, 25,642 గురు ఉండిరి. మొత్తము మీద "కోలము" భాష మాతృభాషగా గలవారి సంఖ్య 25,647 అని తెలియుచున్నది. ✻

హైదారాబాదు రాజ్యములో ఈ తెగవారు ఆదిలాబాదు జిల్లాలో మాత్రమే కలరు. 1941 సం॥ జనపరిగణన ప్రకారము ఈ జిల్లాలో వీరిసంఖ్య 746 మాత్రమే యట! కాని ఈ యంకె సరిఅయినదికాదు. ఈ జిల్లాలోని ఒక తాలూకా, సిరుప్పురులోనే, కోలము తెగవారి కుటుంబములు నాలుగు వందలు లెక్కించబడినవి. నాల్గువందల కుటుంబముల సగా సగటు లెక్కల ప్రకారము రెండువేల జనులని చెప్ప వచ్చును. కనుక ఇతర తాలూకాలనుకూడ కలుపుకొన్నచో జిల్లాలో వీరి సంఖ్య అయిదు వేలకు మించియుండునని అంచనా వేయవచ్చును! ఏలయనగా, ఉట్నూరు తాలూకాలో ప్రత్యేకము భూమిపట్టాలు ఇయ్యబడినవారు 250 మంది, యుట్నూరు, ఆసిఫాబాదులో కూడ వారు అయిదు గ్రామములలో నివసించుచున్నారు. ఇట్లే లక్సెట్టిపేట, రాజూరు, చెన్నూరు, కిన్వటు, బోధ్ తాలూకాలలోకూడ కలరు. దీనివలన, 1941 సం॥ అంకెలు మనప్రభుత్వ నివేదికలలో చూపబడినవి సరిఅయినవి కావని స్పష్టపడుచున్నది.

"కోలము" తెగవారు తమను "కోలవారు" అని చెప్పుకొనెదరు. గోండు తెగవారు "కోలము"లను పూజారులని

---

✻ "The Aboriginal problem in C. P. or Berar" by M. V. Grigson.

పేర్కొనెదరు. కొందరి వలన వారు "భూమకు"లని పిలువబడుచున్నారు. ఆదిలాబాదులోని తెలుగువారు వీరిని "మనియోడులు" అని పేర్కొనెదరు.

కోలము తెగవారు గోండుల కంటెను ఎక్కువ మోట వారు. వీరు విశేషముగా వ్యవసాయవృత్తి కలవారు. అయి నను వీరి వ్యవసాయ జీవనము ఒకచోట స్థిరనివాసము కలది కాదు. వీరొక చోటినుండి మరియొక చోటికి తమ నివాస మును దానితోపాటు తమ వ్యవసాయమును మార్చుకొనె దరు. వారికి నాగండ్లుగాని పశువులుగాని అక్కర యుండవు. ఇది పూర్వకాలపు ముచ్చటకాదు. నేటికిని వారిలో చాల మంది గుట్టలపైన వాలుగానుండు ప్రదేశములలో పార (hoe) తోను, కట్టెల (digegging sheks) తోను త్రవ్వి వ్యవ సాయము చేసికొని పంటల ననుభవించుచున్నారు. వీరు గొర్రెలను, పందులనుకూడ ఉంచుకొనరు. వారి గృహ జంతువులు కుక్కలు, కోళ్ళు మాత్రమే.

కోలములు అతి విస్తారముగా అమాయక స్వభావము కలిగియుందురు. వారి జీవన విధానము అతి సామాన్యము. వారి దృక్పథము అతి సంకుచితము. ఏదేని యొకప్రదేశమున వారు అనేక సంవత్సరముల కాలము కాపురముండినను దాని చుట్టుపట్టులందున్న, అంటియున్న గ్రామము తప్ప అవతల గ్రామపు పేరైన చెప్పగలిగియుండరు. వారున్న గూడెము యొక్క స్థలమును తదితర పరిసరముల హద్దులతో విడదీసి చెప్పజాలరు. చుట్టుపక్కల గ్రామములందలి జనుల స్థితిగతులను

గురించి ఏమియు ఎరుగరు. పట్టాభూమి, పోరంబోకు భూమి, సర్కారువారి పరిరక్షిత (reserved) అడవి వంటి సామాన్య విషయములనుగురించి ఏమియు ఎరుగరు. ఏదైన వివాదముగాని, కష్టముగాని వచ్చినచో వీరికిగల మార్గములు, సాధనోపాయములు రెండే: ఒకటి అక్కడినుండి వెళ్ళిపోవుట, లేదా ప్రతిపక్షులకు లొంగిపోవుట! మూడవ మార్గమును వారెరుగరు. ఇక వీరికి సమీపస్థులేయగు గోండుల సంగతి చూడుడు! వారు పై మూడుతరములవరకు తమ బంధువు లెవరో ఎరుగుదురు. వారు ఎక్కడనున్నారో చెప్పగలరు. కాని కోలములు తమరున్న గూడెమును వదలి వెళ్ళవలసి వచ్చినచో, వీడిపోయిన తమవారితో సంబంధముంచుకొనరు. తమ కత్యంత సన్నిహితులగు బంధువులైనను సరే, వారెచ్చట నున్నారో చెప్పజాలక యుందురు.

కోలములు తమ వ్యవసాయ క్షేత్రములను వదలు కొన్నప్పుడెల్ల తమ యిండ్లను వదలివేసెదరు. వీరి యిండ్లు గోండులకంటె చిన్నవిగా నుండును. ఇల్లు అనగా ఒక గది మాత్రమే. కనుక క్రొత్తయిల్లు ఏర్పరచుకొనుట వారికి కష్టమైనపని కానేరదు.

గోండులు కూడ తమ వ్యవసాయ క్షేత్రములను ఎత్తివేసి క్రొత్తచోటికి పోవుటకలదు. కాని, వారికి వ్యవసాయ సాధనములుకొన్ని- నాగలి, ఎద్దులువంటివి- కావలసియుండును. మన కోలములకు అంతమాత్రమైనను అవసరముండవు. ఈ రెండు తెగలవారికి గల భేదము ఇంతలోనే తెలుసుకొన వచ్చును.

కోలముల పై వ్యవసాయ పద్ధతికి "పోడు" అని పేరు. ఇది వారి పురాతన సాంప్రదాయము ననుసరించి సాగివచ్చుచున్నది. అయినను, విచారించి చూచినచో, ఇది వారి దారిద్ర్య కారణముగా కాన్పించుచున్నది. వ్యవసాయపు శ్రేష్ఠతరమైన పద్ధతులవలంబించు నవకాశము లభించినప్పుడు వారు "పోడు" పద్ధతిని మానుకొనుచుండుట కానవచ్చుచున్నది.

ఈ తెగవారవలంబించు వృత్తులలో తట్టలు, చాపలు అల్లుట యొకటి. ఇవి సిర్పూరు తాలూకాలోని కోలములలో కానవచ్చుచున్నవి. వారి మరియొక వృత్తియగు తేనెను కూర్చుట ఆ తాలూకాలో ఎక్కువ వాడుకయందు లేదు.

కిన్వటు, బోధు తాలూకాలలోని కోలములు ఇతర ప్రాంతములలోని పర్వతవాసులగు తమవారికంటె కొంచెము ఎక్కువ నాగరికులగుచున్నారు. వీరి స్త్రీలు తెలుగు ఆడువారి వలె బట్టలు కట్టుటయు, వారిభాషను, (తెలుగు) మాట్లాడుచుండుటయు కలదు. వీరు పర్వతవాసులగు తమ తెగవారిని "గుట్ట మనియోండ్లు" అనెదరు. తెలుగు మాట్లాడుచున్న తమ తెగవారితోనే వివాహ సంబంధముల కల్పించుకొనుచు, కోలముభాష మాట్లాడు తమవారినుండి విడిపోవుచున్నారు.

కోలము తెగవారి ప్రత్యేక ఆరాధన దైవము "భీమున". వారు ఆ దైవమును "అయ్యక" అనగా "నాయన" (తండ్రి) అని చెప్పుకొనెదరు. స్త్రీ దైవమును "అవల్" అనెదరు.

కోలము తెగవారికి భాషయొకటి ప్రత్యేకముగా నుండుటవలన, వీరు గోండులకు భిన్నులని స్పష్టమగుచున్నది.

"కోలము వ్యవసాయకులు, శారీరకముగా మేరియాగోండు లను పోలియున్నను, వారిభాష ద్రావిడీయమై గోండీభాష, తెలుగుభాష, కన్నడభాషలను పోలియున్నది" అని గ్రిగ్సను గారు తమ పుస్తకమున వ్రాసియున్నారు. సిరూపురు తాలూకాలోని కోలము తెగవారిభాషపైన తెలుగుభాష యొక్క ప్రభావము ఎక్కువగా పడినట్లు కానవచ్చును. దీనిని పడమటిప్రాంతమువారు తెలిసికొనజాలరు. ఉదాహరణార్థము:- పడమటి అనగా మహారాష్ట్రి తాలూకాలలోని కోలములు "మీకేమికావలెను" అను వాక్యమును "తానేడ్ పాహిజే" అనెదరు. ఇక సిరుపూరు తాలూకాలోని వారు ఈ భావమును "తానాడ్ గావల్" అను మాటలో దెల్పుదురు. దీనివలన అటుప్రక్కన మహారాష్ట్రిభాషయొక్క ప్రభావము, ఇటు ప్రక్క తెలుగు భాషయొక్క ప్రభావము కోలముభాషను క్రమముగా మార్చుచున్నదని తోచకమానదు! కన్నడభాష తోటి సంబంధము మరియొకసారి ఆలోచింతము.



# విద్యుచ్ఛక్తి

········

శ్రీ ఒద్దిరాజు సీతారామచంద్రరావు

విద్యుచ్ఛక్తిని గురించి మనమెంత అధికముగా విచారించిన, వివిధ మార్గములలో నది మనకొనరించు సేవ నంత అధికముగా దెలిసికొనెదము. వ్యాపక యంత్రము (Radiator) ద్వారనైన, గొట్టము (Pipe) ద్వారనైన నొక ఆవిరిఘటము (Boiler) యొక్క ఆవిరి (Steam) నొక గదిలోనికి బంపి, ఆగది యందుష్ణము కలిగింప జాలుచున్నారము; ఆవిరి యంత్రమును (Steam Engine) నడిపింప జాలుచున్నారము.

పెట్రోలు నూనెతోను, గాలితోను కలుపబడుచున్నది. అది వర్తులస్తంభము (Cylender) నందు భగ్గున మండి మోటారు ఇంజనుల నడుపుచున్నది. ఉష్ణము పుట్టించుటకు నూనె కాల్పబడుచున్నది. అయిన నివి ఈ సాధారణ విషయముల నతిక్రమించి మిక్కిలి ఉపయోగమున సరిపెట్టుకొనజాలవు.

ఇంకొకవిధమున వేయిన్నొక్క విధముల మనసేవ కుపయోగపడుచున్న విద్యుచ్ఛక్తిని మనముపయోగమునకు గొనుచున్నారము.

చిన్నపని మొదలు సమస్తకార్యములయందు మానవ జాతి కొఱకు విలువగల ఉపయోగములకు విద్యుచ్ఛక్తి ఉపయోగపడుచున్నది. 2 వేల మైళ్ల దూరమునుండి జలాంతర్గత

మ్రోకు (Submarine cable) ద్వారా సముద్రము నుండి ప్రాకుచువచ్చెడు బలహీనమగు విద్యుత్ప్రవాహము (Feeble Electric Current) న కంటె బలవంతమగు విద్యుచ్చలన యంత్రము (Locomotive) యొక్క వేల గుఱ్ఱముల శక్తిగల చాలకయంత్రము (Motor) మనుష్యుని సేవకొఱకు స్పష్టముగానంత ఉపయోగకారికాదు. ఒక పెద్ద విద్యుదయస్కాంతము (Electric Magnet) ఒక అయస్కార కర్మాగారము (Steel Works) నందు పదిపుట్ల ఇనుము నెత్తజాలును. దాని ప్రతిరూపము (Counter part) అగు ఒక చిన్న విద్యుదయస్కాంతము ఒకచోటనుండు చిన్నమీట నొత్తుటతో చిన్నగంటను గణగణ మ్రోగించును. ఒక విద్యుత్ప్రవాహము ఒక కొలిమిలోని పెద్ద ఇనుపముద్ద నెంత వేడి చేయునో అంతసులభముగా చిన్న పాత్రలోని నీరుకాచును. ఒక కోడిగ్రుడ్డు నుడికించును. ప్రపంచమున విద్యుత్తు అధిక శక్తి కలది. అందుకే అది యంత నమ్రత గలదిగా- అంత సరిపెట్ట దగినదిగా- అంత విభాజ్యముగా దానివలననయ్యెడు కర్మలయందు కనిపించుచున్నది. ఆ విద్యుచ్ఛక్తి అందికలో నున్న ఎంతఎక్కువ దూరమునకైనను తీగెలద్వారాగాని, విద్యుద్వాహకముల (Conductors) ద్వారాగాని, అంత ఆశ్చర్యకరమగు త్వరలో ప్రవహించుచున్నది.

పూర్వమొకనాటి యంత్రకారులు (Engineers) పెద్దపెద్ద డైనమోలను జలపాతముల యందలి శక్తిద్వారా నడిపించి, కర్మాగారములు నడచుచున్న సీమసీమలకు విద్యుచ్ఛక్తిని పంపుటకు కలల గాంచిరి. కాని ఆ యుద్యము

మానాడు సఫలత నెంతమాత్రము గాంచినను, ఇపుడంత ఉపయోగమైనది కాకుండును. నేడు విద్యుజ్జనకములు (Generators) జలశక్తి వలన నడిపింపబడుచున్నవి. ప్రపంచము మీద నూర్లమైళ్ళ దూరమునందలి సీమలకు విద్యుచ్ఛక్తి పంపబడుచున్నది. విద్యుత్సంగ్రాహకము (Accumulators) లగు రాసాయనిక ఫలకము (Chemical Plates) లయందు విద్యుచ్ఛక్తి నిలువ చేయబడుచున్నది. రైళ్ళమీద, పడవలమీద, దండుబాటలమీద భూమియొక్క అంచులదాక కొనిపోబడుచున్నది.

విద్యుత్ప్రవాహమునకు గల గతి అధిక నిరోధశక్తి (Resistence) నిచ్చెడు ఒకానొక ధాతువుయొక్క తీగలద్వారా జరుగుచుండును. ఆ తీగ వేడియగుచుండును. ఈ సులభ విధానముద్వారా విద్యుచ్ఛక్తివలన ఉష్ణము కలుగుచున్నది. విద్యుత్తువలన నడచెడు ఇస్త్రీపెట్టె (Iron) యందును, విద్యుత్తువలన వెలిగెడు పొయ్యి (Oven) యందును, విద్యుత్తువలన మండెడు కుంపటి (Stove) యందును ఈ వేడి ఏకమై పోవుచున్నది. విద్యుత్ప్రవాహము తీగెలద్వారా ప్రసరించునపుడు అధిక నిరోధకశక్తిగల ధాతువుల పొడుగు తీగెలు కాగి, ఎఱ్ఱబడుటకంటె విశేషమం దేమియు లేదు.

నిరోధక శక్తిగల తీగెను, ఇంక నెక్కువ ఉష్ణమగు తీగెను, ఇంక నెక్కువ ఉష్ణమగునట్లు కాచిన నది తెల్లని వేడిగలది అగును. అదియె జ్వాలనము (Incandescent) అనబడును. ఈ స్థితి యందది ప్రకాశము నిచ్చును.

ఈ అద్భుత శక్తివలన ఉష్ణము, వెలుగు అతిసులభ ముగా లభించుచున్నవి. విద్యుద్గోళము (Bulb) లేక జ్వాలా దీపము (Incandescent lamp) నందు మిక్కిలి సన్నని తంతువు (Filaments) లకంటె అనగా తీగెలకంటె వేరే మియు లేదు. అందుగల తంతువులంను అధిక నిరోధకశక్తి గలదు. ఆ తీగెలు ఆగోళములోనకు పంపబడియున్నవి. ఆ గోళమునందు ప్రాణవాయువు (Oxygen) ఉన్నచో కాల్చి వైచును. కావున దానినుండి అనగా ప్రాణవాయువును బుడ్డినుండి లేకుండ లాగివేయబడినది.

ఈ విద్యుచ్ఛక్తి మనకు ఉష్ణమును వెలుగును యిచ్చుచున్నది. విద్యుత్ప్రవాహము ప్రసరించుటచే హెచ్చు అంశమునకో, తచ్చుఅంశము (Degree) నకో ఉష్ణము నిచ్చు టకు తగిన పదార్థమందలి నిరోధకశక్తిపై ఈ ఉష్ణము— ఈ వెలుగు ఆధారపడియున్నవి.

విద్యుద్యంత్రము (Battery) వలనగాని, డైనమా వలనగాని కలిగెడు విద్యుత్ప్రవాహమువలన నడుపబడు విద్యు చ్చాలకయంత్రము (Electric Motors) లు విద్యుత్ప్రవాహ మును శక్తి (Power) గా మార్చును. ఆ శక్తి ఒక దంత వైద్యుని బరమ (Drill) నాడించు చిన్న విద్యుచ్చాలక యంత్రమునుగాని, ఒక ఆటవస్తువునుగాని, ఎంతసులభముగా నాడించునో, అంత సులభముగా గంటకు అరువదిమైళ్ళ వేగ మున నడచు రైలుబండిని నడపును.

ఎక్కువపని జరుగు నొక కర్మాగారమునందు వివిధ పరిమాణములందుగల కొన్నిపదుల విద్యుచ్చాలక యంత్ర

ములు పనిచేయుచుండును. అవి బహుశః బల్లపై దిరుగ విసనకఱ్ఱను త్రిప్పునంత చిన్నది మొదలు నూర్ల గుఱ్ఱముల శక్తిగల పెద్దరాక్షసి వరకు వర్గీకరణమంది యుండును.

విద్యుచ్ఛక్తి అన్ని చోటులయందు కలదు. అది వంటిగా కనిపించు త్రోవద్వారా కర్మాగారములో ప్రవేశించును. ఆ త్రోవ ఒక మీటబల్ల (Switch Board) నకు గాని, విభాజకము కొఱకు గల ఏర్పాటునకుగాని సంబంధించి యుండును. అక్కడినుండి అది వివిధ విద్యుచ్చాలకములకును, దీపములకును, వ్యాపకయంత్రము (Radiators) లకును కొలత ప్రకారము పంపబడును. అందలి ఒక్కొక్క పరికరము ఒక్కొక్క మీటబల్లకు అధీనమై ఇష్టమైనప్పుడు పనిలోనకు గొనుటకు, ఇతర సమయములం దాపియుంచుటకు తగిన ఏర్పాటులను కలిగియుండును.

మానవుని దైనికావసరముల కొఱకు అందికలో విద్యుచ్ఛక్తిగల తావులందు శక్తి, వెలుగు, ఉష్ణము అను విషయములు చక్కగా పరిచితములై యున్నవి. తంతి వార్తా వ్యవహారము (Telegraph) మఱియు తంతి సంభాషణము (Telephone) ల వలని వినోదములు గల భూభాగములు మన కాప్తుని వంటివి. మనము వానిదిక్కు మరలినపుడు పెద్దదగు విద్యుచ్ఛక్తితోడి అక్కరను విడచుకొందుము. మనకా సమయమున కావలసినది అపరిమితముగా చిన్నదగు విద్యుత్ప్రవాహము. తంతి వార్తా వ్యవహారమును మరువదగిన వారినిగా మన నొనరించు నంత పరిచితోపకరణముగా తంతి సంభాషణము మనకు లభించియున్నది. అయినను మనము

తపాలు కూటస్థానము (Post Office) నకు పోయినప్పుడెల్ల మన వెనుక కొంతదూరమున టికుటికులాడు నొక ఉపకరణము తన ఉనికిని మనకు జ్ఞాపకము చేయుచునే యున్నది. ప్రపంచ వ్యవహారములతో నవక్షణ సంబంధముగల తంతి సంభాషణ పై గల ద్వేషముతో అన్ని పెద్దపట్టణములలో, నగరములలో, చివరకు మన చిన్న ఊళ్ళలో కూడా తంతి వార్తా వ్యవహారము దివారాత్రములు పనిచేయుచు మిగిలియేయున్నది.

తంతి వార్తా వ్యాపారము మన శబ్దములను ప్రపంచమందంతట దిప్పుచున్నది. తంతివార్తా వ్యవహర్త చెన్నపట్టణములో నొక మీటను నొక్కును. అదేక్షణమున బొంబాయి యందు గల ఒక దుర్బలమైన ఉపకరణము కాగితపునాడా (Paper Ribbon) పై గుర్తు కలిగించును. పదైదు మైళ్ళ దూరముననున్న తనవానితో తన ఉద్దేశము నున్నదియున్నట్లు చెప్పుట కొక మనుష్యుని ఈ తంతివార్తా వ్యాపారము శక్తిగల వానిగా నొనరించుచున్నది. దానికొక నశింపజేయు అవకాశము కూడా ఉండకపోదు.

తంతివార్తా వ్యవహారము మన దేహ వ్యాపారమును రాష్ట్ర వ్యవహారమును పోలియున్నది. నాడీ మండలము వంటిది తంతి వ్యాపారము. నాడీమండలము దేహమున గలదు. దేహము రాజ్యమువంటిది. రాజ్యమునకు రాజువలె దేహమునకు రాజు మెదడు. రాజునకు రాష్ట్ర వ్యవహారము సంబంధించినట్లే, నరములు మెదటితో సంబంధించియుండును. రాజు రాజధానియందుండినను ఆతని శాసనము రాష్ట్రమందంతట వ్యాపించును. మెదటి ఆజ్ఞను నాడీమండలము తత్క్షణమే

ఎఱుగుచుండును. ఎక్కడనోగల తంతివార్త దేశమున వ్యాపించుట సాధ్యమే.

విద్యుచ్ఛక్తికి సంబంధించిన ఇతర విషయములన్నిటి వలెనే తంతివార్తా వ్యాపారముకూడా విద్యుచ్ఛక్తి యొక్క మార్పు మాత్రమే.

అల్లకపు సూదికి పూసవెంట పూసగా గ్రుచ్చిన సిమ్మటు ఈ కడనుండి ఆ కడదాక ఎక్కడను మరియొక పూసకు తావుండదు. అపుడు మఱియొక పూస నెట్లయిన నిరికింప యత్నించినపు డొకపూస నొక కొనయందు బలాత్కరింపవలసివచ్చును. అపుడా సూది శక్తి తత్క్షణమున నే మరియొక కొనపై దేనినో చేసితీరును.

ఈ విధముననే ఒకతీగె తంతివార్తా వ్యవహారపు దీర్ఘ మార్గమున కంతకు సంబంధింపవచ్చును. ధాతువుయొక్క తీగె పై భాగమంతయు విద్యుత్కణముల (Electron) చే ఋణరూపమున (Negatively) విద్యుత్తును కల్పించు అణువులలో సమూహితమగు చుండును. తంతివార్తా వ్యవహర్త తన ముంగిటగల ఒక మీటను నొక్కుటవలన ఆ మార్గమునకు మఱికొంత విద్యుత్ప్రవాహమును చేర్చును. ఆ విద్యుత్ప్రవాహము తనకు చోటుకలుగుటకు గాను తీగెమార్గముపైన నిండియున్న విద్యుత్కణములయందు ఒక కొననుండి ఒత్తిడి కలిగించును. అదివరకే తీగెమార్గ మంతయు విద్యుత్కణములచే ఆవరింపబడి యుండుట వలన ఒక కొననుండి పైబడివచ్చిన విద్యుత్ప్రవాహము కల్పించిన ఒత్తిడికి తట్టుకొనజాలక రెండవ కొననుండి నిర్గమించుట రూపమున నొకపనిని ఒనరించును—.

అట్లొనరించినపనియే తంతివార్తా వ్యవహారమం దావలి కొన కాగిదపు నాడాపై నేర్పడెడుగుర్తు.

అంత త్వరితముగా విద్యుచ్ఛక్తి ఎట్లు నడచుచున్నది ఎఱుగవలసిన విషయము. విద్యుత్ప్రవాహమున కా త్వరితము స్వతస్సిద్ధమై యున్నది. మదరాసులోగల ఒక తంతి కార్యాలయమున గూర్చుండి బొంబాయి తంతి కార్యాలయమున కూర్చుండియున్న మఱియొకనితో నేదేని ప్రశ్నింపగా, ముఖాముఖ సంభాషణమువలెనే ఆ ప్రశ్నకు ఎంతమాత్రి మాలస్యము లేకుండ ఉత్తరము లభించును.

ప్రపంచ వ్యవహారములలో సగపాలు తంతివార్తా వ్యాపారమువలనే నిర్వహింపబడుచున్నది. వెనుక- మనతాత లేదో వ్యాపారమున ఢిల్లీకిగాని, మఱి యే దూరపట్టణమునకు గాని వెడలినపుడు, కొన్ని నెలలదాకా వారిజాడ తెలియకుండెడిది. ఇపుడన్ననో ఎవడైనను చక్కని సముద్ర మార్గమున— నిరాలంబమగు నాకాశ మార్గమున లండనుకో, న్యూయార్కునకో వెళ్ళి, అక్కడ చేరినదే తన సురక్షిత ప్రవేశమును గూర్చి తంతివార్తా వ్యాపారము ద్వారా తెలుపుచు తన యింటివార్తలను గురించి విచారించును. అతడాదూరదేశమందుండియు తనయింట తనమిత్రులతో కలసియున్నవాడే అగుచున్నాడు. విద్యుచ్ఛక్తి మనుష్యజాతి యందొకనితో నొకనికి సంబంధము గలిపించెడు బంధమై యున్నది. దూరమనెడు సమస్య కొట్టుబడిపోయినది. ఎక్కడి నుండియైన ఎంతదూరముననుండియైన నొకరొకరి భావములను తెలిపి, తెలుసుకొనుచున్నారు.

తంతి సంభాషణము (Telephone) ను గురించి సంభాషింప గోరువారి మధ్య నెంత దూరముండిన నీ అల్ప శక్తిగల విద్యుత్ప్రవాహము తీగెలద్వారా అతిసూక్ష్మమును వివిధమును నగు మానవస్వరమును లాగుకొని పోవుననుట తెలిసికొనవలయును.

నేటిదినమందఱును రమారమి తంతి సంభాషణను వాడుక యందుంచు కొనినవారే. తంతి సంభాషణములేక వ్యాపారమంతయు నసంభవమే. దైనిక జీవితము నందును కష్టములే ప్రాప్తమగుచుండుననియును చెప్పవచ్చును. పెక్కు అంగడుల పర్యవేక్షణ నొనరింపవలసిన నిర్వాహకు డొకడు ఒకనాడన్ని కొట్లను కలియదిరిగి రాజాలడు. అపుడు అట్టి అంగళ్ళలోని కార్యకర్తలతో నిర్వాహకుడు తంతిసంభాషణము వలన అచటి వ్యవహారముల నడిగి తెలిసికొన జాలుచున్నాడు. వ్యాపార జీవితము నందలి చురుకుదనము తంతి సంభాషణ సహుపాయమువినా నేడు అనుగెత్త లేనిదిగా నున్నది.

అనుక్షణము తంతి సంభాషణ యంత్రమున కంటి యున్న కొక్కెమును చేతలాగి, కలకత్తా, బొంబాయి, మదరాసుల బజారుధర లెట్లున్నవి, ఢిల్లీ యందలి కేంద్ర ప్రభుత్వము నేడు తీర్మానించిన విషయములేమి, కాశీ, ప్రయాగ, మధుర, తిరుపతి, శ్రీరంగము మొదలగు పుణ్యక్షేత్రములలో జరుగనున్న ఉత్సవపరంపర ఏ విధముగ నున్నది- అను మొదలగు విషయముల నెన్నిటినో "నీవచట నున్నావా?" అని అడిగినంత సులభముగా విచారించి, వచ్చిన వివరముల నొకదాని వెంట నొకదానిని నిలుపుట జరుగు

చున్నది. అనగా తూర్పుననున్న వారిని పడమట నున్న వారిని గుంపు గూర్చుచున్నారమనుట.

ఆధునిక ఆవిష్కారము ఇంకను విచిత్రమైయున్నది. ఛాయాపటములు, చిత్రపటములు, సంతకములు మొదలగు నవి ఒక దేశమునుండి మఱియొక దేశమునకు విద్యుచ్ఛక్తి ద్వారా పంపబడుచున్నవి. కొద్ది కాలమునకు పూర్వము థారన్ బేకర్ (Thorne Baker) అను శాస్త్రజ్ఞునిచే కనిపెట్ట బడిన ఒక విధమగు తంతివార్తా వ్యవహారముద్వారా పారిస్ - మాన్‌చెస్టర్ మున్నగు ప్రదేశములనుండి లండన్‌కు చిత్రపటములు పంపబడుచున్నవి. మఱికొన్ని నాళ్ళకు ఫ్రెంచి దేశమందలి శాస్త్రజ్ఞుడగు ఎడూయర్డు బెలిన్ (Edouard Belin) అను నాతడు ఫ్రెంచిదేశపు ప్రధానామాత్యుని సంతకమును నిస్తంత్రి (Wire less) ద్వారా, గంభీరమగు వాయు మార్గమున ఈఫెల్ గోపురము (Eiffel towr) నుంచి సంయుక్తరాజ్యము (United states) లందలి గ్రాహక స్థానమునకు పంపియున్నాడు.

ఒక చిత్రము తంతివార్తా వ్యాపారముద్వారా పంప బడునపుడు వేలకొలది చిన్న ముక్కలుగా భాగింపబడును. ఒక్కొక్క ముక్కకు దాని గరిమ మూల్యమును విద్యుచ్ఛక్తి రూపమున నప్పగింపబడును. ఛాయాపటము నందలి వెలుగు నీడలతోడి బలమునందు భేదపడుచున్న ఈ విద్యుత్ప్రవాహ ములు ఆకాశ (Ether) మార్గమున పంపబడును. నిజమైన పటమునందలి ఆకారమునకు ప్రతిరూపమును రూపించుట ముక్కలను కూడబెట్టు యంత్రమునందలి చిన్న చిన్న

చిత్రవర్ణపు ఇటికె ముక్కలు వెలుగు నీడల చిహ్నములుగా కూడుకొను తీరుగా నేర్పాటు గావించిన మనుష్యుని బుద్ధి చతురతగల గ్రాహక స్థానము (Receiving Station) నకు చేరును. ఆ గ్రాహకస్థానమింత దూరమున నుండవలయునను నియమము లేదు.

ఎంతకాలమో చెల్లకమునుపే - దైనిక వార్తలతో పాటు మనోహరముగు చిత్రములు, విగ్రహములు ప్రతి ద్వీపమునకు పంపబడగలవు. అవి దైనిక నిస్తంత్రి వార్తాపత్రికలందు స్పష్టములగు చుండును. ఆ విధానము సముద్రయాన మొనరించు వారిని వారు విడచిన స్థలముతో అత్యాశ్చర్యకరమైన సన్నిహితమం దుంచును.

సూచనలను సూచించుటకు సంబంధించిన పెక్కు ఉపాయములందు విద్యుచ్ఛక్తి వాడబడుచున్నది. అన్నిటిలో మన మెఱిగినంతలో చిన్నదగు సూచన విద్యుద్ఘంట(Electric Bell) తీగె నడుమ 'తెగియున్నపుడు ఏపని చేయజాలకుండును' కాని, ఒక మండలమున విస్తరించియున్న ఘంటగాని, దగ్గరగా చుట్టబడియున్నట్టి తీగెయందుగాని సర్వదా ప్రవహించుచుండుటకు ప్రయత్నించుచుండెడు విద్యుచ్ఛక్తిని గురించి ఆలోచించెదమేని, విద్యుచ్ఛక్తితో ఎట్టి విస్పష్టమైన సూచన (Signal) ల నీయజాలెదమో సులభముగా బోధపడగలదు.

ఒక విద్యుద్యంత్రము (Battery) యొక్క ధన స్తంభము (Positive pole) న కొక తీగెనమరించి దానిని చెన్నపట్టణమునుంచి బొంబాయికి, బొంబాయినుంచి మరల చెన్నపట్టణమునకు నందింపవచ్చును.

విద్యుద్యంత్రమునుండి వెడలెడు విద్యుచ్ఛక్తి తీగె పొడుగున నెక్కిపోవును. ఆ పొడవున కింతదూరమని నియతి లేదు. ఆ తీగెయొక్క రెండవ చివరను ఋణస్తంభము (Negative pole) నకు అమరింప వలయును. ఋణస్తంభము నొద్ద స్తబ్ధసంచారము (Closed circute) లేక సదాతన సంచారము (Continuous circute) కలదు. దానిచుట్టు విద్యుచ్ఛక్తి ప్రవహించుచుండును. విద్యుద్యంత్రి మందలి ఋణస్తంభమున కమరింపబడక తీగెయొక్క రెండవచివర స్వేచ్ఛగా విడువబడి యుండెనేని విద్యుత్ప్రవాహము ప్రవహింపజాలదు. ఆ దశను ముర్తసంచారము (Open Circute) అనెదరు.

తీగెపొడుగున విద్యుద్యంత్రిశక్తి (Energy of the Battery) నిక్కపొడుచుకొని ప్రసారముకొఱకు చుట్టుకొని యున్న ధాతువుయొక్క సంపూర్ణ సంచారము కలిగినతోడనే శక్తిని ప్రసారించుటకు నిరీక్షించుచున్న తీగెలు సిద్ధముగా నుండును. ఇదేవిధమున ఋణస్తంభము నొద్దగాని, మధ్యమార్గమునగాని, తీగెకు తెంపుకలిగెనేని తెగినచోట సంధి పుట్టి, విద్యుత్ప్రవాహమును ప్రవహింపనీయదు.

అగ్న్యుపద్రవము పట్టున విద్యుచ్ఛక్తి అపాయసూచకముగా గంటమ్రోగించును. పెద్ద పెద్ద కర్మాగారముల యందును, కొలువుకూటములందును ఉపయోగించెడు విద్యుద్ఘంట ఒక విద్యుద్యంత్రముద్వారా విచ్ఛిన్న సంచారము (Broken Circute) నకు కలుపబడియుండును. విద్యుత్సంచారము విచ్ఛిన్నమగు దాక గంటమ్రోగదు. విద్యుత్సంచా

రము యొక్క కొనలు అంతదాక స్వేచ్ఛగా నుండినను, అవి యొక వస్తువుతో కలుపబడియుండును. ఆవస్తువునందొక ధాతుశకలముండును. అది అగ్గియొక్క వేడివలన పొడుగుగా నగును. ధాతుశకలమట్లు పొడుగగుటవలన, ఆతీగెలతో ధాతువునకు సంస్పర్శకలుగును. ఇట్లు సంచారము పూర్తినొంది గంటను మ్రోగించును. వీధులలోని అగ్ని ఉపద్రవసూచకమునందు పగల్పబడిన అద్దముల చిన్నగవాక్షమునకు వెనక లాగబడిన పిడికిలి అగ్నికూటము (Fire station) లో నుండు విద్యుద్యంత్రమునకును, విద్యుద్ఘంటకును మధ్యనుండు విద్యుత్ప్రవాహమును దగ్గరపడచేయును. ఆ సమయమున తంతీసంభాషణకుగల గ్రాహకము (Receiver) ను పైకెత్తినంత రెండు స్పర్శములు (Contacts) ఎచటినుండి విద్యుత్ప్రవాహము పరివర్తన (Exchange) స్థానమునకు సంచారము ద్వారా ప్రవహించునో అచట కలసిపోవును. దానివలన వ్యవహర్తయుండుచోటగల సూచక ఉపకరణము నందొక దీపము వెలుగును. అదియే పిలుచుచుండిరనుటకు సూచన.

పాత్రలు మొదలగు ధాతువులపైన వెండి - బంగారము - నికిల్ ధాతువులను పూతపూయించిన అందమైన వానినిగా నొనర్చు పనియందు విద్యుచ్ఛక్తి వలన నెక్కువ పని గొనుచున్నారము. ప్రపంచమందు కళాయి (Electric Plating) పని విస్తరించియున్నది. అట్లు పూతపూయుటవలన ఆ వస్తువులు గాలివలని మార్పునకు లొంగి చెడిపోకుండ చౌకవిధానమున రక్షించుకొనెదము. కావున నది ముఖ్యమైన వానిలో నొకటి. ఇనుము చెమ్మగాలికి త్వరలో చిలుమెక్కి

కొన్ని దినములలో నలిగి పాడియగును. ఒక ఇనుప తునకను మురికి లేకుండ తెల్లజేసి విద్యుద్యంత్ర మందలి ఋణ స్తంభము నకు సంబంధించిన తీగకుకట్టి, నికిల్ లవణముతో కూడుకొని యున్న నీటిలో మునుగునట్లుంచవలయును. ఒక నికిల్ ముక్కను విద్యుద్యంత్రమందుగల ధనస్తంభమునకు సంబంధించిన తీగెకు గట్టి, ఆద్రావకము నీటిలో మునుగునట్లుంచ వలయును. ఆద్రావకముద్వారా నికిల్ యొక్క లోహము గుంపుగాపోయి ఇనుపముక్కపై పలచనిపొరగా నికిల్ ధాతువుయొక్క పూతబూయును. అపుడావస్తువు అందముగా మెఱుగుపెట్టబడును. అట్లు పూతబూయబడిన ఇనుమెన్నటికి గాలివలన త్రుప్పుపట్టకుండును.

ఇదేవిధముగా నగలవర్తకులు వస్తువులపై బంగారు పూత నెక్కింతురు. వెండిపనివారు చౌకరకపు తెల్లని ధాతువులతో వస్తువులనుచేసి, వానిపై వెండిపూత నెక్కించెదరు. ఇదియే విద్యుచ్ఛక్తివలన నయ్యెడుపూత.

నూర్ల పరిశ్రమలందు విద్యుచ్ఛక్తి వాడబడుచున్నది. పదివేల విధములుగా యంత్రకారులు (Engineers), రసవాద శాస్త్రజ్ఞులు (Chemists) దాని నుపయోగించుచున్నారు. ఈనాడు విద్యుచ్ఛక్తివలన అపారమైన పరిమాణమున ప్రాణ వాయువు (Oxygen) యథావిధిగ నిర్మింపబడుచున్నది. ఈ ప్రాణవాయువును ఛాయారహితవాయువు ఆర్చి (Acetylene Flame) తో కూర్చి అతుకుడు (Welding) పని కుపయోగించుచున్నారు.

విద్యుత్ప్రవాహమునకుగలశక్తి ప్రకృతిచే కల్పింప బడిన బంధనముల మార్చివేయుటకు పదార్థములలోని మూల వస్తువులను విడదీయుటకు సమర్థమైయుండు లాభదాయిగా నున్నది. ఏదేనిధాతుమిశ్రమణము(Metalic Compounds)ల నుంచి ధాతువును తీసివిచి నపుడు అది అద్భుతమైన పరిశుద్ధతగలిగియుండును. ఈ విధానమున లభించు రాగి అపరిమిత పరిశుద్ధతగలిగి యుండుటయే మనకు నిదర్శనము. దానిని విద్యుత్తామ్రమనియే వర్తకసరణిలో వ్యవహరించెదరు.

దినదినము ప్రపంచమునకు ముఖ్యమగుచున్న రసాయన పరిశ్రమ వాయువులకు ఖనిగానున్నది. మొక్కలకును, వంటచేలకును అభివృద్ధికరమును, ప్రాణాధారమునునగు నైట్రోజన్ బృహత్పరిమాణము వాయువులో కనిపించుచున్నది. కృత్రిమమైన యెఱువులందు నైట్రోజన్ వుండవలసిన పదార్థము. సల్ఫేట్ ఆఫ్ అమ్మోనియా, నైట్రేట్ ఆఫ్ అమ్మోనియా మొదలగు నైట్రోజన్ మిశ్రణముల పెద్దమొత్తము కర్షకుల ఉపయోగమునందున్నది. ఈ యుపయోగము శీతోష్ణస్థితియందు ఉష్ణపరిమాణము తగ్గుగానున్న దేశములం దెక్కువగ నున్నది.

ఆక్సిజన్‌ను గురించి తెలియపరచిన ఆంగ్లదేశ రసవాద శాస్త్రజ్ఞుడగు ప్రెస్ట్లీ(Priestley)అను నతడు క్రీ. శ. 1779లో గాలినుండి విద్యుత్కిరణము ప్రసరించినపుడు ఒక ఆసిడ్ పుట్టుచున్నదని కనిపెట్టెను. కొన్ని సంవత్సరముల తరువాత విఖ్యాతుడైన కావెండిష్ (Cavendish) అను నాతడ

ఆవిధముగా నుద్భవించు ఆసిడ్ నైట్రిక్ ఆసిడని రుజువుచేసెను. ఈ నైట్రిక్ ఆసిడ్ నైట్రోజన్, హైడ్రోజన్, ఆక్సిజనల మిశ్రమమని అతని సిద్ధాంతము. మొదట గాలినుండి నైట్రిక్ ఆసిడ్ రూపమున నైట్రోజన్ లభించెను. ఈనాడు జలశక్తిచే కల్పింపబడిన విద్యుదుత్పత్తి స్థానములు (Electrie Plants) వాయువునుండి విలువైన ఈ నైట్రోజన్ గాలిని ఆకర్షించు పనియందున్నవి.

బర్కెలాండు (Birkeland) అను నాతని వలనను ఈడి (Eyde) అను నాతని వలనను తీవ్రముగా కాచిన మంట లోని ప్రకాశమానమైన తగడుపై వాయుప్రసారము కలిగి యుండుటకని పెట్టబడెను. ఆమంటను విద్యుచ్ఛూర్యుడనియెదరు. యథార్థముగా ఈ మంటయే పెద్ద ఆర్క్ జ్యోతి. ఈ మంట అయస్కాంత సహాయమున ఆరడుగుల పొడుగువరకు వ్యాపించును. ఇటికెల ఒరగల ప్రొయ్యియందు వాయువుపై నిది ప్రసరించును. అంతట సున్నపు పాలలోనకు _ అనగా సున్నపు కలకములోనకు నైట్రోజన్‌ను ప్రసరింప జేసెదరు. ఈ విధానమున ఎఱువు సిద్ధమగును.

క్రీ. శ. 1905 లో ఈ విధానము కనిపెట్టబడినపుడు గాలిలోని నైట్రోజన్ వలన 115 టన్నుల ఎఱువు సిద్ధము చేయబడెను. క్రీ. శ. 1919 నాటికి ఆ పరిమాణము అభివృద్ధి గాంచి పదివేల టన్నుల ఎఱువు సిద్ధమయ్యెను.

ఈ నాడు పంటచేలకాహారమగు నైట్రోజనునకును, వర్తక వ్యాపారమునకును కావలసిన, ఆక్సిజనను గాలినుండి సంగ్రహించుట పెద్దపరిశ్రమమైయున్నది. ప్రపంచసౌభాగ్యమును

గుఱించిన మఱియొక ఉపాయము అనుక్షణము విద్యుత్తు నకు సంబంధించిన రహస్యములు వెల్లడింప బడుచుండు రూప మున నున్నది.

విద్యుచ్ఛక్తి వలన నిర్మింపబడిన సర్వవిధోప యోగము లందు వాడబడుచున్న మఱియొక విషయమును మన మీ సమ యమున విచారింపక విడువ కూడదు.

వైద్యమునకు సంబంధించిన పనులయందు సమస్తమును తలక్రిందు జేసెడు ఎక్సురే - (X-Ray) యొకటి స్వస్థపర చెడు విధులయందెక్కువ ఉపయోగపడుచున్నది. అలసిపోయిన హృదయము యొక్క దుర్బల చలనమును సైతము చూపెడు ఆ సున్నితమైన ఉపకరణము విద్యుచ్ఛక్తి వలన నడుపబడు చున్నది. దుర్బలమై—క్షీణించుచు ప్రసరించెడు నొక విద్యుత్ప్ర వాహము మహా సముద్రములోనకు పంపగా అదియుద్ధనౌకను నడుపుట - వేయిటన్నుల గుట్టను కరిగించుట ఒకేవిధముగా జరుపుట మనకు సాదృశ్యము.

........

# వంగవిప్లవకవి - నజ్రుల్

•••○●○•••

శ్రీ తిరుమల శ్రీనివాసశర్మ

బంగాలపు నైక్యతావిభాజ్యతలు ఇతిహాసపు గీటు రాయిపై నిలువలేదు. ఇది సమయమునకు దగిన యవస్థ మాత్రమేమైనను బంగాళము భారతదేశమునకు వలె నొక్కటి కాగలదు. అయినను వంగభాషమాత్రి మవిభాజ్యమైయుండి నది, యున్నది, ఉండగలదు. పాకిస్థానమై కొంతకాలమే యైనను, భారత సీమాంతరవాసులగు మహమ్మదీయులు పాకిస్థానములో నుండియు, పాకిస్థానీయులైనప్పటికిని, వంగ భాషనే తమ మాతృభాషగా ప్రకటించుకొనిరి. ఈ విషయ మున వారెంతటి యాక్షేపణనైనను లెక్కింపరు. అచటి జను లపై ఉర్దూభాషయొక్క బరువును మోపుటలో లీగువారసమ ర్థులు కాగా, జిన్నా స్వయముగా వచ్చినను జయముచేకూర లేదు. పరిస్థితి మిక్కిలి విషమించి తుదకు పాకిస్తాను ప్రభుత్వము లొంగి పూర్వపాకిస్థానీయులకు వంగభాషయే మాతృభాష యని యొప్పుకొనెను.

వంగభాష యీ ప్రకారముగా సమస్త బంగాలీయుల భాషగానున్నది. బంగాలీయు లితర విషయములలో నెన్ని యేని మతభేదముల గలిగియున్నను తమ భాషయగు "బంగాలా" పట్ల ఐకమత్యమును కలిగియున్నారు. బంగాలపు హిందూమహ మ్మదీయులు భిన్నభిన్నములగు యూనియను ప్రాంతములలో

నున్నప్పటికిని వారొకే భాషలో మాట్లాడి, వ్రాసి, స్వప్న ములఁజూతురు. అయిన నీమాట భారత దేశము నెల్లప్పటికిని చీలికలు పేలికలుగా చూడగోరువారికి మాత్రము విషప్రాయ మగుచున్నది.

సుప్రసిద్ధుడగు ఖాజీనజ్రిల్ ఇస్లామును వంగభాషైక్యతాప్రతీకమని చెప్పవచ్చును. ఆతని కవిత్వము నే హిందువైన ననాదరభావమున మహమ్మదీయ కవితయని యన లేదు. నిజమునకతడు 'బంగాలా' భాషకొక క్రొత్త ప్రాణమును వోసెను. ఇతడు రవీంద్రయుగములో పుట్టినను తానొక దిగ్గజ మనిపించుకొనుటకు చేసిన ప్రయత్నము, తత్సాఫల్యము లెంతయు గొప్పవి!

సాహిత్యాకాశమున రవీంద్రుడు పూర్ణప్రభలతో వెలుగుచున్నప్పుడు అచట నేతానొకప్రకాశ, కొలదికాలమునకే కానిండు, నిలచి ప్రజలమనముల నాకర్షించుట, యీకవి సామర్థ్యమును చాటుచున్నది.

ఇచట బంగాలాకే 'ఆధునిక కవి' అను పుస్తకమునుండి కొన్ని పంక్తుల నుద్ధృతము చేయుట నవసరము కాదను కొందును:-

"ఒకకాలమున నజ్రుల్ కవిత్వము వంగసాహిత్యములో గొప్ప యాందోళనమును కలిగించియుండినది. అతడు 1914-18 మహాయుద్ధానంతరమొక ధూమకేతువువలె హస్తములో 'నగ్నవీణ'ను పట్టుకొని వచ్చెను."

నజ్రిల్ ఇస్లాము వ్యక్తిజీవన మొక ధూమకేతువు వలెనే యుండినది. వాఙ్మయాకాశమున నతడొక

ధూమకేతువువలె నే ప్రవేశించెను. అతడు పశ్చిమబంగాల్ లోని ఒక బీదకుటుంబములో జన్మించెను. అతనికి చిన్ననాట తగిన విద్యాభ్యాసము లభింపలేదు సరికదా, హృదయమున నుప్పొంగు కోరికలను పారద్రోలుటయు నతడెరుంగడు! అతడు ప్రకృతి యొడిలోని వరపుత్రుడై పెరిగి కవిగా మారెను. పిన్న తనమున నతడెన్నియోమారు లింటినుండి పారిపోయెను. మార్పులేని నీరస వాతావరణమే దీనికి కారణమైయుండును. అతని కంఠము బాగుండుటచే నతడెన్నియో మారులు నాట్య మండలిలో చేరెను. అతడొక సారి పూర్వబంగాళములోని యొక పల్లెకు పారిపోయి తొలుత నొక సభ్యగృహస్థుని యొద్దను, తరువాత నొక రొట్టెలమ్మువానియొద్దను నుద్యోగ మునకు కుదిరెను.

1914 లో ప్రపంచ సంగ్రామ మారంభమైనప్పుడితడు సైన్యములోచేరి కడకు హవల్దారయ్యెను. యుద్ధమునుండి మరలిన తరువాత నితడు "ధూమకేతు" వను నొకపత్రికను నడిపెను. అది యెక్కువ దినములు నడువకున్నను వంగవాఙ్మయమున నతనికొక స్థానమును తప్పక చేకూర్చెను. ఏ వంగ కవియైనను 'ఒకనాటి యుదయమున జాగృతుడగు గొప్పకవి' యని నజ్రుల్ నే చూపును. రవీంద్రునిఖ్యాతి దినదినము పెరుగు చుండినది. నజ్రుల్ సమకాలికుడగు శ్రీ శరచ్చంద్ర చటో పాధ్యాయుడు చూచుచుండగనే గొప్పరచయితయనిఖ్యాతి గాంచెను.

నజ్రుల్ గంటలకొలది వ్రాయుచుండు స్వభావము కలవాడు. అతడు కలమును వారములకొలది కన్నెత్తియైనను

చూడని దినములున్నవి. ఈ యవకాశమును పురస్కరించుకొని పత్రికా సంపాదకులలో గొందరతని నొక గదిలోనుంచి కాగితములు, కలము, తేనీరుల నందుంచి యతనికి దెలియక తలుపులబిగించి బయటికి పోవుచుండెడివారు. కొన్ని గంటల తరువాత, వారతని చెంతకుబోయినప్పుడు, వారికొక సుందర కావ్యమో, ఒక రచనయో దొరికెడిది.

నజ్రుల్ సాహిత్యమున ప్రవేశించినయుగము విద్రోహ యుగము. 1857 విప్లవములో సాఫల్యమును పొందనినాటి నుండియే విద్రోహపుగడియలు పనిచేయుచుండెను. వంగ విభజనమున జనులిప్పుడే జాగృతులైరి. చూచుచుండగనే దేశము విజయయాత్రకై తరలినది. ఇదేసమయమున ఖాజీ నజ్రుల్ తన ముక్తకంఠములో:

"ఆమి దుర్వార్
ఆమి భేంగే కోరి సబ చురమార,
ఆమి అనియమ ఉచ్ఛృంఖల
ఆమి దలేజాయీ జతో బంధోన
జతోనియ కానూన శృంఖల"

"నేను దుర్వారుడను. నన్నెవ్వరును నాపజాలరు. నేనన్నిటిని ధ్వంస మొనర్చగలను. నాకు నియమము లేదు. నేనుచ్ఛృంఖలుడను. ఎన్ని బంధములు, నియమములు, సూత్రములు, శృంఖలములున్నవో వాటినన్నిటిని కాలరాచి ముందుకేగెదను."

'విప్లవ ఆసీ విద్రోహకోరి — నేచే నేచే గోంఫేది ఇతావ.'

(7)



“నేను క్రాంతిని తెచ్చెదను. నేను విద్రోహ మొనర్తును; నాట్యమొనర్చుచు మీసముల దువ్వెదను.”

'ఆమి ధృష్ట
ఆమిదాంత దియాఛిండి విశ్వమాయేర–అంచల.'

“నేను హఠవాదిని. నా దంతములచే విశ్వమాత చెరగులను చించివైచెదను.”

'ఆమి విద్రోహి భృగు
ఆమి భగవాన బుకే ఎంకేదేబో పదచిహ్న
ఆమి స్రష్టిసూదన
శోకతాపహానా ఖేయాలీ విధిన
బక్షోకోరిబ భిన్న.'

“నేను విద్రోహి భృగువును. నేను ఈశ్వరుని హృదయమున నా పద చిహ్నముల నంకిత మొనర్తును. నేను సంహారకుడను, శోక తాపాదికములకు మారుగ నొక విధమున నుదాసీనుడగు విధాత హృదయమును వ్రయ్యలింతును” అని పాడెను.

ఖాజీయొక్క యీ కవితలో బాంబు, మైన్, డైనామేటుల స్ఫోటనమున్నది. ఇప్పుడు మనము స్వతంత్రులమైనందుకు బాంబు, మైన్, డైనామేట్లు మనకు సామాన్యములైనవి. అయినను నా కాలములో నీ వస్తువుల కావ్యములో బ్రయోగించుట యొక విధమగు భయమును కలిగించునదిగనే యుండినది. ఆ విషయ మిప్పు డూహించుటయు కఠినముగ నున్నది. ఒకవైపు భయంకర శబ్దప్రయోగము వేరొకవైపు

విద్రోహ విచారములు; ఈ రెండును నాటి వంగయువకుల హృదయముల నొక్కుమ్మడిగ చూరగొనినవి.

నజ్రుల్ తప్పనిసరిగ విప్లవకవి కావలసివచ్చెను. అతని వైఖరి యంతయు నతని నైజమును చాటుచుండినది. ఎంతైనను నతనిపై రవీంద్రుని పడి యచ్చు లేకపోలేదు. ఈ సంగతి నతడు బాగుగ నెరుగును. కావుననే యతడు రవీంద్రుని జన్మదినోత్సవ సందర్భమున నిట్లనియుండెను.

'హే రస శేఖరకవి, తవజన్మదినె
ఆమికోయె జాబో మోర నవజన్మకథా
ఆనన్ద సున్దర తవో మధుర పరశే
అగ్ని గిరిగిరి – మల్లికార ఫూలేఫూలే
ఛొయేగేఛా.'

"ఓ రసశేఖరకవీ! నీ జన్మదినోత్సవావసరమున నేను నా నూత్న జన్మగాథను వివరింతును. నీ యానందముచే సుందర మధుర స్పర్శచే పర్వత మల్లికా ప్రసూనములపై ప్రత్యేకముగ జ్వాలాముఖులావరించినవి."

పూవులో జ్వాలాముఖి పుట్టుటయను కల్పనమెంత యందమైనది!

నజ్రుల్ విద్రోహావసరము విద్రోహులకు విద్రోహ రూపమును ధరించి యుండినది. ఇదియొక సోపానము. జీర్ణ శీర్ణములగు సమాజ పద్ధతులకు విరుద్ధముగా విద్రోహ మనివార్యమగు నప్పుడు విద్రోహుల హృదయములో భవిష్యత్ పద్ధతీచిత్ర మస్పష్టముగా నుండును. అట్టియెడ విద్రోహమున కెట్టి యుద్దేశ మూలమగు వర్ణమును ప్రాప్తము కాదు.

అట్టి తరి కేవలము విద్రోహ మొనర్చుట, ఖండన మండనముల గావించుట, పూర్వమున్న వద్ధతిని రూపుమాపుటలే సమంజసము లనిపించును; విద్రోహానంతరమున నుండు అవస్థయొక్క రూపమును స్పష్టపరచు నవసరమప్పుడు గోచరముకాదు. అప్పుడు విద్రోహ మొనర్చుటయే చరమ లక్ష్యమని గోచరమగును.

ఖాజీ నజ్రుల్ కవితలో నిప్పుడు చెప్పిన యుద్రేకమే యెక్కువగా కనబడుచున్నది. దీనిలో బుద్ధి బలముకన్న సదుద్దేశమే యెక్కువగనున్నది:— స్ఫూర్తి ఓజోమయ శబ్ద ప్రవాహమున నతడు మనలను తీసికొని పోవునప్పుడు దాని యంతర్గత వస్తు వేదై యుండునన్న విషయమునే మరచి పోదుము. యుద్ధ నినాదమును వినునప్పుడెవడు మథితార్థముల విమర్శనలో పడును? అప్పుడు మనముకూడ సైనిక పంక్తిలో నిలువబడి కుడి ఎడమలను లెక్కించుచు తరలిపోవుదుము.

ఇదిగాక, నతని కవిత్వము కేవలము విద్రోహమును నకు విద్రోహమై, యిదే దృష్టితో తనయుగపు ప్రతీకమైనను ఖాజీ మనస్సులో స్పష్టముగు నుద్దేశము లిట్లుండెను.

> 'మహా విద్రోహి రణక్లాంత
> ఆమి శేయి దిన హబో శాంత
> జబే ఉత్పీడి తేర క్రందన రోల ఆకాశే బాతాసే
> ధ్వనిబేనా
> అత్యాచారీర ఖడ్గకృపాణభీమరణభూమే రణిబేనా
> విద్రోహి రణక్లాంత
> ఆమి శేఈ దిన హబో శాంత.'

"నేను మహావిద్రోహిని. రణక్లాంతుడనై— ఏదినము పీడిత జనాక్రందనధ్వని యాకాశమున రేగుచు,నత్యాచారులకై ఖడ్గకృపాణములు భయంకరములై రణభూమిలో కన బడునో, అప్పుడే శాంతుడ నయ్యెదను. నేను విద్రోహిని, రణక్లాంతుడనై యాదినమే శాంతుడ నయ్యెదను."

ఈ ప్రకారము ఖాజీ నజ్రుల్ విద్రోహపు టుద్దేశము అత్యాచారమును ముగించుటయై యుండినది. అయిన లక్ష్య మింకను దూరముండినది. కావుననే దానిపై నంతగా శ్రద్ధ వహింపలేదు. విద్రోహముపైననే లక్ష్యముండినది. విద్రోహ చండిక మేల్కొనని, తరువాత చూడవచ్చును. విద్రోహము నకు విద్రోహభ్రమ మరొక కారణమై యుండినది. దీనికెటు జూచినను మైలపడిన పద్ధతులు, రాజనీతిలో బానిసత్వము, సమాజమున రూఢి మరియు గతానుగతికముల గొప్పదన ముండినది. ఈశ్వరుడు సైతము ధనికుల సైగలకు నాట్యమాడు చుండెను!

మరల నొకసారి 'బంగాలాకే ఆధునిక కవీ' అను పుస్తకమునుండి కొన్ని పంక్తులను వివరింతును:—

"ఖాజీ నజ్రుల్ భాషపై నధికారమును గలిగియున్నాడు. అతని కవిత యోజః పూర్ణమైనది. ఇతనికి పూర్వమున్న కవు లలో ద్విజేంద్రలాల్ కవితలో మాత్రమే యితనికన్న నెక్కువ యోజస్సుండినదని యనవచ్చును అయిన ద్విజేంద్రలాలుని భావప్రధానమగు నోజము. ఇతనిది భాషాప్రధానమైనది."

ఇతని కవితలోని భాషాచమత్కారమున భావువ లోతుపాతులను వెతకుట వ్యర్థమని యనేకులు నుడివిరి.

జర్మన్ మహాకవి గేటే, బైరనును గురించి— "అతడాలోచించినంతవరకు బాగుగనే యుండును. ఆలోచనకు మొదలిడిన క్షణమునుండి యతని పిల్లతనమే కనబడుచుండు"నని చెప్పెను. నజ్రుల్ను గురించి కూడా శ్రీ బుద్ధదేవవసూయిదే ఈ ప్రకారము నుడివెను. ఇతని దృష్ట్యా బైరన్ మరియు నజ్రుల్ సమానులు. "అతనివలెనే నజ్రుల్ ప్రతిభ యైశ్వర్యశాలిని. అయిన నిది యెంతవరకుండునో, యెపుడు మోసగించునో చెప్పుట కలవికాదు. ఇతనిలోనదే కాఠిన్యము, నదేయెడ నెడ నిలచి సాగుస్వాభావికతా ప్రభావము, పరిశ్రమలేక ననాయాసముగా లభించిన కుశలత, నిర్లక్ష్యము, వీటన్నిటిపై విచారశీర్ణతలున్నవి." 25 సం॥ల వరకతడు ప్రతిభా వరపుత్రునివలె సాహిత్య వీధిలో వెలుగొందెను. అయిన నతనిలో ప్రౌఢిమ కలుగలేదు. అతని రచనలలో క్రమవికాసమేదియు దృగ్గోచరముకాదు. అతడిరువదియవవయస్సున వ్రాసినట్లే, ముప్పది యవయేటను వ్రాయుటచే నతని వ్రాతలో నేమార్పును గలుగలేదు.

అతని కొన్ని కవితలలో ఇజ్రాయిల్, ఇసాఫీల్, నూర్ ఖయామత్, మున్నగు నిస్లామ్ ధర్మవ్యక్తులును, వస్తువులును, ఘటనలును నుల్లేఖింపబడినవి. అయినను నతని కవిత్వములో నేమార్పును కలుగలేదు. అతడు వంగభాషలో బయటనుండి జొనిపిన నుపమానోపమేయములు గుర్తుపట్టుటకు రానివిగ నున్నవి. అతని కృతులలో నూటికి తొంబది తొమ్మిది పద్యములనుండియైనను నతడు మహమ్మదీయుడని బోధపడదు. అతని కవిత జాతి సాంప్రదాయక శబ్దములలో నభివర్ణితమైనద

కాదు. అతని లోకజాతి, సాంప్రదాయములనునవుండినవి-యాధునికత మరియు విద్రోహము లే.

అయిన ఖాజీనజ్రుల్‌ను కేవలము విప్లవకవియని మాత్రమే యనుట సరికాదు. అయినను నతడిట్లు వ్రాసి యున్నాడు.

'కేబాజాబె బాంశీ ?
కోథాపాబో అనిన్దిత సున్దరేరహాఃసీ ?
ఆజోశుధు ఆగనునీ గాహిఛే శానాఈ.
ఓజనో కాందిఛే శుధునాఇ, నాఇ, నాఇ'

'ఎవడు మురళి వాయించును ? ఏ నిర్మల సుందరహాసమును నేనెటనుండి తెత్తును ? నేడును కేవల మాగామిని గురించి ఏ సౌన్నాయి పాడుచున్నది. లేదు, లేదు, అది లేదు.'

ఖాజీనజ్రుల్ ప్రేమ విరహములపై వేన వేలుగీతముల రచించెను. ఆతని కంఠము బాగుండి సంగీతములో విశేషజ్ఞుడుగ నున్నాడు. గ్రామఫోను కంపెనీ వారితని గీతములనుండి లక్షలు గడించిరి. ఝుమర్, భాటియాల, బావుల్, గజల్, తుమరీ, ఖయాల్, ధ్రుపద్, కీర్తన్, శ్యామాసంగీత్ మరియు నాధునిక సంగీతపు నే శైలినైనను నతడంటక వదలలేదు. 'లీలాయిత చంచల, అంచల, పరసనే,' 'శూన్య ఏబుకే పాఖి మోర ఫిరేఆయ్, ఫిరేఆయె'-ఈ రెండును ఖయాల్ శైలిపైగాయనములు. దర్బారి కనడ 'బాజేమృదంగ బాజే,' 'కిసుఖేగృహెరబో' కీర్తనలు ప్రతియొక్కరిచే పాడబడుచున్నవి. కేవలము వ్యవహారములోనున్న రాగములు మాత్రమేగాక నతడనేక లుప్తస్వరములను పునరుద్ధరించెను. కౌశికీస్వరమున

వ్రాసిన- 'శ్మశానే జాగిఛె శ్యామా, అంతిమసంతానే కీలేది తే స్థాన'- మరియు శివరంజనిలో, 'హే' పార్థసారథీ, బాజావో, బాజావో పూ పాంచజన్యశంఖే'- మొదలైనవి జనప్రియములైనవి. గీతా క్షేత్రమున రవీంద్రుని తరువాత నజ్రుల్ స్థానమైయుదిన్న. గ్రామఫోను కంపెనీ వారి ప్రోత్సాహముచే నితడు రచించిన పాటలలో తారతమ్యానుసారముగా వెల కట్టుటకు సాధ్యపడకున్నది. అయిన నవన్నియు నాకే కొల బద్దకిందికి రావు. ఇతడు రచించిన గీతికలనుబట్టి కొందరు పండితులు- 'రవీంద్రుని యితర కవికన్న నితడే ముందంజవేసె'నని యొప్పుకొని యున్నారు. రవీంద్రుడు రెండు వేల గీతముల వ్రాసెను. నజ్రుల్ కొద్ది సమయమున నే రవీంద్రునికన్న నెక్కువ వ్రాసెను. రికార్డు పాటలలో నితడందరిని మించెను.

ప్రేమగీతికలలో నజ్రుల్ తన యుగమునకు సంబంధించిన వాతావరణమునకన్న నెక్కువ పైకెగయ జాలకపోయెను. అనగా రోమాంచవాదమున నే యుండెను. అయిన నతని రోమాంచవాదము మిగుల శ్రేష్ఠమైనది. అతనిలో కీట్సు యొక్క Pictorial quality (చిత్రరూపము), బైరను యొక్క Passion (ఆవేగము) లున్నవి. అయిన రవీంద్రుని గాంభీర్యము మాత్రము సున్న. రవీంద్రుని కావ్యము వంగ సాహిత్యములోని గొప్ప సంపద అయిన, నజ్రుల్ మహాత్వమొకదృష్టిచే నతనికన్న గొప్పదిగా నున్నది. అది సంయుక్త బంగాలమును పునరుద్ధరించు గొప్పశక్తియైయున్నది. శుద్ధ కావ్య విచారమున గొప్పసంగతి తెలియక పోయినను, జీవనము, సంస్కృతి, ఇతిహాసములకు కూడా స్థానమున్నది కదా.

సంయుక్త బంగాలపు శ్రేష్ఠతమ సాంస్కృతిక ప్రతీక మనబడు నజ్రుల్ అనేక వర్షములనుండి మస్తిష్క వికారమున కెరయయ్యెనని వినుటచే పాఠకులు మిగుల బాధపడుదురు. ఇతని జాడ్యమునకును ఒకకథయున్నది. ముసల్మానుడైనను నజ్రుల్ ఒక హిందూయువతిని పెండ్లాడెను. అప్పుడితని ఈ వివాహమును కొందరు తూలనాడిరి. అయిన ఖాజీనజ్రుల్ పేరునకు మాత్రమే ముసల్మానుడై యుండెను. ఈ వివాహమువలన నతడు సుఖముగానే యుండెను. తరువాత నితనిభార్యకు పక్షవాతమైనది. దీనికై నజ్రుల్ అనేక చికిత్సలు చేయించెను. తుదకు యంత్రమంత్రములను చేయసాగెను. ఈ మూలముననే నతనికి శిరోవికార మారంభమైనది. ఇప్పటికిని నతడు కోలుకోలేదు. దేశపరిస్థితుల నీ కవి వరుని దుగ్నేత చూచుచున్నదా? ఒక సోదరుడు వేరొక సోదరుని కుత్తుకకోసినప్పుడు, దేశము రెండుముక్కలుగా విభజింపబడినప్పుడు ఖాజీనజ్రుల్ యేమనగలడు?

................

# కలరా రోగము

శ్రీ బాలబందు పోలాకి శ్రీనివాసరావు

కలరా రోగము వలన నెందరో మృత్యువువాత బడుచున్నారు. ఈ రోగ మొకానొక దేవత వలన కలుగుచున్నదని కొంద రభిప్రాయపడి మిక్కిలి భయముతో మెలగుచున్నారు. కలరా సంభవించునప్పు డొకరియింటి కొకరు వెళ్ళకుందురని ఎవరికిని దెలియనీయరు. అట్లు తెలియజేయక పోవుటచే రోగము నందరకూ పంచిపెట్టిన వారగుచున్నారు. "నా హక్కుగల యిల్లు నేను తగులబెడితే మీకేమి?" మనిన యెట్లగును? తన ఇంటితోబాటు మరికొందరి యిండ్లు కాలిపోవునుగదా! కలరా అంటురోగము. కనుక ఒకరి యింటి నుండి యింకొకరి యింటికిగాని, ఒక గ్రామమునుండి వేరొక గ్రామమునకుగాని సాధారణముగా పోవుట కిష్టపడరు. అట్టి పరిస్థితులలో ఆరోగ్యశాఖ ( హెల్తు డిపార్టుమెంటు ) వారు ప్రజలందరకు కలరా ఇన్‌జెక్షను లిత్తురు. ఆ ఇన్‌జెక్షనులను తీసుకొన్నవారు ఎక్కడికైనను పోవచ్చును. ఇన్‌జెక్షను వారము దినములకు ఫలించును. అది ఫలించిన పిమ్మట కలరా వలననంతగా భయముండదు. ఆ ఇన్‌జెక్షను బల మారుమాసముల వరకుండును. కనుక ప్రజలందరు ఇన్‌జెక్షనులను తీసుకొనవలెను. గర్భవతులును తీసుకొనవచ్చును. మందు పిండముంజే గర్భకోశమునకు బోజాలదు. కనుక నెట్టిహానియు కలుగబోదు. గర్భిణి ఇన్‌జెక్షనును తీసుకొనుటలో రెండు విధములగు

మేలు కలుగుచున్నది. తల్లి తనకు కలరా రాకుండా గాపాడు కొనుటయేగాక శిశువునుసైతము గాపాడవలసినదగు చున్నది.

కొందరు ప్రజలలో పూర్తిగా నజ్ఞానము నశించి యుండలేదు. తెలిసీ తెలియని వైద్యులచే నౌషధముల నిప్పించుట, ఇతరు లొసంగే పలువిధములైన సలహాల నన్నింటినీ యోచింపకయే ఆచరించుట మున్నగువానిలో జిక్కుచున్నారు.

కలరా ఒక భయంకరమైన అంటురోగము. అది కంటికి గనుపించ నంతటి చిన్న పురుగులవలన కలుగుచున్నది. ఆ పురుగులను జూడవలెనన్న కలరారోగి విడిచిన వాంతి విరేచనములను సూక్ష్మదర్శిని యను యంత్రములో జూచిన గాన్పించును. ఈ సూక్ష్మజీవులగు పురుగులు ఒకటి రెండుగాను, రెండు నాలుగుగాను, నాలు గెనిమిదిగాను రెట్టింపుగా బెరిగి వృద్ధిజెందును. ఒకపురు గొక రోజులో (24 గంటలలో) నూట యిరువది లక్షల కంటె నెక్కువగా నభివృద్ధి జెందును. ఈ పురుగులు మిక్కిలి వేడి ప్రదేశమందుగాని, శీతల ప్రదేశమందుగాని వృద్ధి బొందజాలవు. సమశీతల ప్రదేశములు తావు జేసుకొని యుండును. వీటికేమాత్రము చెమ్మ దొరికినను ప్రీతి. మరియు, వృద్ధి బొందుట కనుకూలమగు ఋతువు, స్థలము, ఆహారము దొరకెడి వరకు గనిపెట్టుకొనియుండి, తొలకరి వానలలో నీటితో గలిసి కొట్టుకొని వచ్చును. ఆ నీటిని దాగినవారికి కలరా రోగము సంభవించుచున్నది. కనుక, నీటిని సలసల కాచి వడియగట్టి చల్లార్చి త్రాగవలెను. నీరు

మరిగించుట వలన నీరు యందలి పురుగులు చచ్చును. మనము వంట జేసుకొనుటలో నీటి మరుగుట వలన నందలి సూక్ష్మజీవులు చచ్చును. ముఖ్యముగ మనము త్రాగెడి నీటి యందు జాగ్రత్త నహించవలెను.

కలరా రోగము నీటివలనగలిగి ఈగలవలన వ్యాపించు చున్నది. ఈగలకు నూగువంటి వెంద్రుక లున్నవి. కలరా రోగులు విడిచిపెట్టిన వాంతి విరేచనములపై ఈగలు వ్రాలుట వలన వాటికాళ్ళకు రెక్కలకు కలరా పురుగు లంటుకొనును. ఆ ఈగలు వ్రాలిన ఆహార పదార్థములను మనము దినునపుడు కలరా రోగము సంభవించుచున్నది. కనుక, ఈగలు ముసరకుండా జాగ్రత పడవలెను. మురికి వస్తువులు లేకుండా నుండునప్పుడు ఈగలవలన భయము గలుగదు.

ఇరుగుపొరుగు గ్రామములకుగాని, తమ గ్రామమునకు గాని కలరా సంభవించినదని తెలియవచ్చిన వెంటనే ప్రజ లందరు కలరా ఇన్‌జెక్షనులు తీసుకొనవలెను. మరియు తమకు కలరా ప్రాకకుండా కాపాడు కొనుటకు గ్రామమంతయు పరిశుభ్రము జేయించి, నీటివసతులు పాడుచేయకుండా నుంచు కొన వలెను. చెరువులు, దిగుడు బావులు మొదలగు నీటి వసతులలో స్నానము జేయరాదు, బట్టలుతుకరాదు, అంట్లు తోమరాదు. నివసించే ఇంటిగోడలకు సున్నము పూయించ వలెను. ఇల్లు, దాని పరిసరములు పరిశుభ్రముగా నుంచుకొన వలెను. పేడకుప్పలు, చెత్త పెంటలు లేకుండా జేయవలెను. ఈ చెత్తలను ఊడ్పించి, కాల్పించుట మంచిది.ఇక్లేఅనవసరమైన

చింకిగుడ్డలు, చింకిచాపలు, గోనెలు, పాత తట్టలు, బుట్టలు మున్నగు చిల్లర సామాగ్రిని కాల్పించవలెను. మురికి గోతులు, మరుగుదొడ్లు, పశువుల శాలలుఎప్పటి కప్పుడు పరిశుభ్రము జేయుచు చుండవలెను. క్రొత్త సున్నముతో తయారుచేసిన ముగ్గుపొడి (క్రొత్తగా విరబోసి యార్చిన సున్నముపొడి) చల్లుట మంచిది. సున్నముయొక్క ఘాటునకు విషపురుగులు చచ్చును. ఈగ వ్రాలకుండును. కనుకనే మన వారు గోడలకు సున్నమును పూయించుట, ఇంటియందు, వాకిళ్ళయందును సున్నముపొడితో ముగ్గులను బెట్టించుట మున్నగు యలవాట్లను జేసియున్నారు. మన పూర్వులు నియమించిన యాచారము లన్నియు ఆరోగ్యమునకు సరి పోవుచున్నవి. మన వంటయింటిని శుభ్రపరచుకొనవలెను. వంటపాత్రలు, వాడుకొనెడు పాత్రలుచక్కగా తోమి పరిశుభ్ర పరచవలెను. మరియు మనము భుజించెడి పదార్థములపై ఈగలు వ్రాలకుండా మూతలు పెట్టించవలెను. కాళ్ళు, చేతులు, నోరు మున్నగునవి చక్కగా కడుగుకొని భుజించ వలెను.

కలరా సమయములలో వేడి వేడి పదార్థములు భుజించవలెను. చల్లని పదార్థములను, అజీర్ణముచేసే పదార్థము లను దినరాదు. ఆకుకూరలు, దుంపకూరలు తినరాదు. బల వంతముగా విరేచనములు కలుగుట కౌషధములు తీసికొన రాదు. మన దుస్తులు, పరుపులు, మంచములు మున్నగునవి పరిశుభ్రముగా నుంచుకొనవలెను.

కలరా రోగము తాకినపుడు కొన్నిగంటలు మొదలు నాలుగుదినములలో బక్కమై దాదాపు రెండువారముల వర కుండవచ్చును. గంజివలె తెల్లగానుండు విరేచనములగును. వాంతులగును. మూత్రము జరుగక నిలిచిపోవును. శరీరము నులియుట (పీకుట), కడుపులో నొప్పి గలుగుట, ప్రాణశక్తులు క్షీణించుట మున్నగునవి కలరా లక్షణములు.

కలరా మనకు సంభవించినదని తెలుసుకొన్నంతనే ఆ గ్రామ మునసబుగారిని గాని, దగ్గరగానున్న డాక్టరుగారిని గాని, కలరా ఇనస్పెక్టరువారినిగాని అడిగి చేయవలసిన సాధన దెలుసుకొనవలెను. కలరాకొరకు కట్టిన ఆసుపత్రి ఉన్నట్లయిన రోగిని అక్కడకు బంపవలెను. అట్లుచేయుట కవకాశము లేనప్పుడు రోగిని బాగుగా వెలుతురువచ్చు గదిలో నుంచి ఆ గదినుండి అనవసరమైన బట్టలు, పరుపులు, సామానులు వగైరా తీసివేయించవలెను. మరియు పెరటిలో రెండడుగులు చదరముగా, రెండడుగులు లోతుగల గోయిని త్రివ్వించి ఆ గోతిలో ఆరంగుళముల ఎత్తున ఊకబోసి ఉంచ వలెను. రోగి విడిచి పెట్టుచుండెడి వాంతి విరేచనములు మొద లగునవి ఒకకుండలో పట్టించి ఈగోతిలో బోసి కాల్పించుచుండ వలెను. వాంతి విరేచనములు మొదలైనవి నేలపై పడినట్లు యిన క్రిసాల లోషనుతో గడిగించవలెను. కలరా పురుగులు వ్యాపించకుండా అవసరమగుచున్నసారులు వాంతి విరేచన ములు మున్నగునవి గోతిలో పోసి ఊకవేసి కాల్పించుచుండ వలెను. క్రిసాల లోషను హెల్తువారినిగాని, గ్రామాధికారు లనుగాని అడిగిన దొరుకును. అంగళ్ళయందును క్రయమునకు

లభించును. ఈ లోషను కడుపులోనికీయరాదు. అట్లుచేసిన చావు తటస్థించును. ఈ లోషను కలరా పురుగులను చంపి వేయగలదు. ఒక కడవలో ఒకవంతు లోషనునకు నూరు వంతుల నీళ్ళుచొప్పున పోసి ఉంచుకొనవలెను. దీనినే చిక్కని లోషనని యందురు. ఇంకొక కడవలో ఒకవంతు లోషనునకు మూడువందల వంతులు నీళ్ళుపోసి ఉంచుకొనవలెను. దీనినే పలుచని లోషనని యందురు. ఈ రెండు కడవలను వాకిట నొకచోట నుంచుకొనవలెను.

రోగి కుపచారములు చేయువారు నియమితముగా నొకరిద్దరు మాత్రమే ఉండవలెను. రోగికి మందులిచ్చే గ్లాసులు, ఆహార మిచ్చే పాత్రలు మొదలైన వెప్పటి కప్పుడు చిక్కని లోషనుతో కడిగి, వేడినీళ్లతో శుభ్రపరుచు చుండ వలెను. రోగి గదిలో నితరులు త్రాగుటగాని, తినుటగాని చేయరాదు. ఉపచారకులు పలుచని, లోషనుతో చేతులు కడుగు కొనుచుండ వలెను. అప్పుడప్పుడా ఇంటిలోను, వాకిటి యందును చిక్కని లోషను జల్లుచుండవలెను.

రోగి చనిపోయి నట్టయితే శవముసుండి కొంత సేపటి వరకు నోటివెంబడి, మలద్వారము వెంబడి చెడుద్రవము స్రవి స్తునే ఉండును. కనుక శవమును చిక్కని లోషనుతో స్నానము జేయించవలెను. శవమును కాల్చివేయుట మంచిది. అట్లు జేసిన పురుగులు నశించును. లేదా, లోతుగా పాతిపెట్ట వలెను. నీటిలో బడవేయుటగాని, పాతిపెట్టకుండా పార వేయుటగాని చేయరాదు. అట్లు జేసిన వ్యాధి వ్యాపించును. శవమును మోయువారు, ఉపచారకులు వారి వారి వస్త్రముల

నున్నూ, రోగియొక్క వస్త్రములనున్నూ పలుచని లోషనులో తడిపి, సలసల మరిగిన నీటిలో నుతుకవేసి చాకలివానికి వేయించవలెను. శవము మోతగాండ్రు, ఉపచారకులు తేలిక లోషనులో కాళ్ళు చేతులు శుభ్రముగా కడుగుకొనుచుండ వలెను. కాలి గోళ్లయందుగాని, చేతిగోళ్ల యందుగాని కలరా పురుగులు యిడుకొని యుండవచ్చును. ఆ చేతులతో భోజనము జేసినట్టయిన కలరా రోగము సంభవించవచ్చును. ఇట్టి విషయములలో నేమరుపాటుగా నుండుటవలన కలరా ప్రాకి, అనేకులు చావ వలసి వచ్చుచున్నది. కనుక కుంకుడు కాయలతోగాని, శీకాయ పొడితోగాని, సెనగ పిండితోగాని చేతులు మున్నగునవి రుద్దుకొని సబ్బుతో కడుగుకొని పిమ్మట చేతితో భోజనము చేయవలెను.

కలరా రోగులకు పోర్డియేరియా మిక్శ్చరు, కలరా మాత్రలు, పెర్మాంగ్నేటు మాత్రలు అను మూడు రకముల మందుల నిత్తురు. మొదట పోర్డియేరియా మిక్శ్చరు నీళ్లలో కలిపి పదిచుక్క లీయవలెను. అది యిచ్చిన పావు గంటకు కలరా మాత్ర ఒకటి యివ్వవలెను. అది యిచ్చిన పావు గంటకు పెర్మాంగ్నేటు మాత్ర ఒకటి యివ్వవలెను. పిల్ల వాండ్రయిన, వారి వయస్సును బట్టి మోతాదు తక్కువచేసి యీయవలెను. మూత్రము ఝూరీగాక నిలిచి పోవునపుడు బొడ్డుచుట్టూ, నడుము చుట్టూ ఆవాలు పట్టువేసినమూత్రము జరుగగలదు. అల్లే రొమ్ముగుంటలో ఆవాలు పట్టువేసిన వాంతులు జరుగుట నిలిచిపోవును. ఒడలు నులుపు కలిగి నప్పుడు తర్పెంటు తైలము రుద్దవలెను. దాహము వేసినపుడు

మంచినీరు వేడిజేసి యీయవలెను. వారము దినములవరకు అన్నమును ఆహారముగా నీయరాదు. బార్లిగంజి ద్రాగించుచుండవలెను. అందువలన మూత్రము కూడా ఝారీగా నగును.

ఈ విధమైన కలరా చరిత్రమును దెలిసికొన్నప్పటికిని ఆచరణలో నుంచునప్పుడే కలరా రోగమును జయించ నగును.



# ముద్రణకళ - నిర్మాతలు

................

## శ్రీ ఒద్దిరాజు సీతారామచంద్రరావు

ఈనాటి ప్రపంచమునకు ముద్రణాలయములు, ముద్రణ కార్యము, ముద్రిత సారస్వతము పరిచిత విషయములలో నొకటి. ఐనను ఈ కళ ఎట్లావిష్కృతమయ్యెను, ఎవరు కని పెట్టిరి, ఎన్నిసంవత్సరములయ్యె, నిర్మాతకు నిర్మాణ కర్మయం దెట్టి సదుపాయాసదుపాయములు సంభవించె ననుటను తెలుసుకొనుట అనుచిత మెంతమాత్రముకాదు.

ఈ సందర్భమున ముద్రణమెట్టిదో తెలియని ఆనాటి పరిస్థితులను స్మరించుట, ఒకనాటి కష్టమును జ్ఞాపకమునకు దెచ్చుకొని నేటి సౌఖ్యగరిమను కనిపెట్టుటయే.

ప్రపంచము కొన్ని వేల సంవత్సరములకు పూర్వమే ముద్రణకార్య మెరిగియున్నది. అయినను ఆ ముద్రణము సారస్వత ముద్రణమునకు సంబంధించినదికాదు. రాజులు మొదలగువారు ఉంగరములు మొదలగు వానిపై తమ నామాక్షరములను, సంకేత చిహ్నములను చెక్కించి, ప్రభుత్వాంగీకార సూచకముగా శాసన పత్రములపై రంగుపూసి ముద్రించునట్టిది— నాణెములపై ముద్రించునట్టిది. ఇదియే ఆనాటి ముద్రణకళ.

ఆ కాలమునాటి సారస్వత మంతయు సాధ్యమైనంత వరకు వేదముగా—అనగా: నేర్చుకొని జ్ఞాపకమునందుంచు

కొన దగినదిగా నుండెడిది. కొన్ని గ్రంథములు తాటాకు సంపుటములలో గంటములతో జెక్కబడిన లిపితో నుండెడివి. అట్టి గ్రంథములన్నియు నీనాటి యొక చిన్నలో చిన్న గ్రంథాలయము నందలి పుస్తక సంఖ్యకు సరిపోలకుండెడివి. ఆ కొలది గ్రంథములైనను సులభముగా సిద్ధముచేయబడలేదు; ఒక్కొక్క గ్రంథమునకు ఎక్కువకాలము పట్టకపోలేదు; వ్రాయించుట కధికవ్యయము కాకపోలేదు. అందఱు వ్రాయజాలిన వారు గాకుండిరి. చక్కగా, పొంకముగా వ్రాయనేర్చినవారి సంఖ్య స్వల్పముగా నుండిన కారణమున వ్రాత కూలికిగాను వారి కధిక ధనమిచ్చి తృప్తిపరచవలసి వచ్చెడిది. వర్తకులకు, ధనికులకు ఇప్పటివారికి గల వ్రాతపని లేకుండెను. నిత్య వ్యవహారములలో నేదేని యొక ముఖ్యమైన పద్దు వ్రాసుకొనవలసి వచ్చినపుడు వ్రాయనేర్చిన వారిచేత — వారికొక మేరకు మాస— సంవత్సర భృతుల రూపమున ధనమిచ్చి తాటాకులమీద వ్రాయించుకొనుచుండిరి. ఏదేని వ్రాతపుస్తకము నెవరైన గొనదలచినపుడయ్యెడు ధనవ్యయము నియతిలేనిదిగా నుండెడిది.

ఈస్థితి కేవల భరత ఖండమునకేగాక ప్రపంచమున కంతటికి పట్టినస్థితి. పడమటి దేశమందొక గృహస్థుడు "ఫ్లోరెన్సు" (Florence) నొద్ద నొక పల్లెటూరి యింటిని కొనదలచి తన యొద్దగల ఒక వ్రాతపుస్తకము నమ్మెనట; ఆ పుస్తకమును కొనినవాడు తనకుగల భూవసతిలో నొక భాగమును విక్రయించెనట !

పశ్చిమదేశములలో రచయితలైన, వ్రాయసకాండ్రైన గ్రీసులోను, రోములోను మాత్రమే కొందఱు కనుపించుచుండిరి. వారు తమ వ్రాత గ్రంథములకు మిక్కిలి వెల బెంచిరి.

ఆనాడు కూడా ప్రపంచమందంతట నివసించు జనులకు మనస్సు నాకర్షించు గ్రంథములు కావలయుననను నభిలాష మెండుగనున్నను, గ్రంథములు లభింపక ఖిన్నులగుచుండిరని తెలిసికొనుట మనకు కష్టము కాకపోదు.

ఆ లోప పూర్తి నొనరించెనను ఖ్యాతి పాశ్చాత్యుడగు "జాన్ గుటెన్‌బర్గ్" (John Gutenberg) నకు లభించెను. ఆతడొనరించిన నిర్మాణారంభము ముద్రణకళకు పునాది. రాను రానది సవరణలపై సవరణలబొంది, మహోన్నతపదవి నందెను; అది యింకను నూత్న నూత్న వీధులలో మెఱుగు పెట్టబడుచునే యున్నది.

కళానిర్మాణ కార్యమును తెలసికొనుటకు ముందు లోకమున కొక మహోపకార మొనరించిన జాన్‌గుటెన్‌బర్గ్‌ను గుఱించి కొంత తెలసికొనుట అప్రస్తుతము కాదు.

ముద్రణకళను గుఱించిన అభిప్రాయ మెవరికి ఏ కాలమున కలిగినది యెఱుగజాలకున్నారము. కావున ప్రథమమున యోచించుటయు, యోచనకనుగుణ్యమగు కార్యమునాచరణ యందుంచుటయు జాన్ గుటెన్‌బర్గ్ వలననే జరిగినదని తలంపవలసియున్నది.

గుటెన్‌బర్గ్ ఏ సంవత్సరమున జన్మించినది, అతని బాల్యమెట్లు గడచినది మన మెఱుగము.

'ఆతని స్వగ్రామము జర్మనీ దేశమందలి "మెయింజు" (Mainz). అతడు క్రీ. శ. 1410 సంవత్సర ప్రాంతమున జన్మించియుండును. ఆతని తల్లిదండ్రులు ఉత్తమ జన్ములు. తండ్రిపేరు 'గాన్సుఫ్లీష్'(Gans Fleisch); కాని ఆతడు తన తల్లియందు తనకుగల గౌరవాధిక్యతబట్టి ఆమె పేరును ముందు నకుగొని వచ్చిన వాడనయ్యెదనను భావమును బట్టి తనతల్లి పేరుతో దన్ను వ్యవహరింపించుకొనువాడు.

గుటెన్ బర్గ్ పది సంవత్సరముల వాడుగా నున్నపుడు మెయింజునందు ధనికులకును దరిద్రులకును మధ్యపోరాటము ప్రాప్తించెను. గాన్సుఫ్లీషు ధనికవర్గములోని వాడగుటవలన మెయింజును విడచి, కొడుకుతో, "స్ట్రాస్ బర్గ్ (Strasbourg)" నకు పారి పోవలసినవాడయ్యెను.

గుటెన్ బర్గ్ పసితనమునుండి బుద్ధి చతురతగలవాడు; ఏదో నూతన విధానమును కనిపెట్టుటకు తీవరించు మనస్సు కలవాడు. ఆతను తల్లిదండ్రులతో గూడి స్ట్రాస్ బర్గ్ చేరిన పిమ్మట - పదేను సంవత్సరముల ప్రాయము మించకమునుపే- రాళ్లకు మెఱుగు (Polish) నెక్కించి, అద్దములనుగా జేయుట కారంభించెను. అది అతని పరిశ్రమలలో మొదటి దాని అభ్యాసము.

ఆ పనికిగాను ఆతనికి తన యింట లభింపజాలిన ధనమునకంటె చాల ఎక్కువ ధనము కావలసివచ్చెను. అపుడాత డాయూర ధనికుడగు "అంద్ర్యూడ్రిట్ జెహ్" (Andrew-Dritzehn) యొద్ద కావలసిన ధనముసప్పుగాగొని తనతో నాతనినొక భాగస్వామిగా నుంచుకొనెను.

దర్పణ నిర్మాణమంతకు పూర్వమే దేశమందారంభింపండి విరివిగా నమ్మబడుచుండెను. కాని గుటెన్‌బర్గురతన యీ క్రొత్త విధానమున తన మెరుగురాతి అద్దములే ప్రచారములోనున్న అన్ని రకముల అద్దములకంటె మంచివనిపించుకొనవలెనని తలంచెను.

ఈ పరిశ్రమను వారు పదిరెండు సంవత్సరములు నిరర్గళముగా నిర్వహించిరి. కాని ఆ పరిశ్రమయందలి అదృష్ట దేవత అతనియెడ విముఖమయ్యెను.

ఆ సమయమున 'ఏక్జిలాచాపెలి-(Axi-la-Chapelle)' యనుచోట గొప్ప యుత్సవ మొకటి జరుపబడనుండెను. భాగస్వాములిద్దఱు ఆ యుత్సవములో పెక్కు అద్దముల నమ్మెదమను పేరాసబూని, అనేక దర్పణముల సిద్ధపరచిరి. దానికొఱకమిత ధనము వ్యయమయ్యెను. కాని ఆ యుత్సవ మాగిపోయెను. ఆ సరుకంతయు నమ్ముడుపోక నిలువబడిపోయెను. వారి కాశా భంగమయ్యెను.

ఈ పరిణామమే వారి ఆ వ్యాపార నాటకమునకు భరతవాక్యమయ్యెను. గుటెన్‌బర్గ్ జీవిత గ్రంథమున నా పుట మరల వేయబడగా క్రొత్త పుట దృశ్యమయ్యెను. అతని జీవిత నాటకమున కథానాయకుడు రంగమంచపై ప్రత్యక్షమయ్యెను.

ప్రజలలో గ్రంథాభిలాష అనుదిన మభివృద్ధి యగుచుండుటయు ఎక్కడనో తప్ప వ్రాతప్రతులైనను దుర్లభములగుచుండుటయు, లభింపజాలిన వాని అధికమూల్యము జన సామాన్యము కందికలో లేకుండుటయు గుటెన్‌బర్గ్‌నకు

ప్రతిదినానుభవమే. ఆ విషయమంతయు కొన్నినాళ్లనుండి ఆతని దృక్పథమునందు నగ్నసృత్య మొనరించుచునే యుండెను. ముద్రణ కార్యమే సాధ్యమయ్యెనేని జనులకు గల ఒక పెద్ద లోపము తొలగిపోవునను నొకయూహాజ్యోతి నేడాతని మనస్సునందు త్తేజిత మయ్యెను. ఈ భావమాతనికి వెనుకటినుండియే యున్నను, ఇప్పుడే కలిగినను- ఈనాడు మాత్రము కార్యరూపమునపరిణమించెను.

ఆతడొకకఱ్ఱ దిమ్మె (Wooden block) ను గొని, దానిపై నొక చిత్రమును చెక్కి, సిరాపూసి, కాగిదముపై ముద్రించి చూచెను- మఱల నొకటి రెండు ప్రతులను ముద్రించెను; అన్నియును భేదమేమాత్రమైనలేక, ఒక్క పోలికలో కన్నులపండు వొనరించెను. కాని అవి కఱ్ఱ దిమ్మెపై చెక్కిన చిత్రము యొక్క ప్రతులు. సారస్వతమునకు సంబంధించినవైననే కాని ప్రపంచమందుగల ఒక పెద్దలోపము తొలగిపోవును. ప్రయత్నించినచో సారస్వతమునకు సంబంధించినను ధైర్యమాతనికి కలుగక పోలేదు.

పుస్తకముల పుట లీకఱ్ఱదిమ్మెలపై చెక్కిముద్రించిన ముద్రింపవచ్చును, కాని అది సులభమైన పనికాదు. పోలిక చెడకుండ ఆ కఱ్ఱదిమ్మెలపై నక్షరముల జెక్కవలయును. అట్లు చెక్కి పుటకొక దిమ్మెనుగా సిద్ధము చేయవలయును. ఒక పుస్తకమునందెన్ని పుటలుండునో అన్ని దిమ్మెలు సిద్ధము చేసి, ఆ పుస్తకమునకు కావలసిన ప్రతులను ముద్రించుకొనవచ్చును. కాని, ఇన్ని కఱ్ఱ దిమ్మెలు సిద్ధమగుట ఒక పుస్తకమును చేత వ్రాసుకొనుట కంటె త్వరగా ముగించునదికాదు;

ప్రతులు సిద్ధమైనను వెల స్వల్పమగునట్లు నిర్ణయించుటకు నవీలై దియునుకాదు.

ఇన్నిటికంటె పెద్దచిక్కొకటి ప్రాప్తమగుచున్నది. అట్లు సిద్ధముచేసిన దిమ్మెలు ఎన్నిసారులకైనా ఆ పుస్తక ప్రతులనే తీయును. మఱియొక పుస్తక ముద్రణమునకు క్రొత్త దిమ్మెల జెక్కి సిద్ధము చేసుకొనవలసియుండును. ఇదంతయు సాగెడు పనిగా గుటెన్‌బర్గ్‌నకు కనిపింపలేదు.

ఈ యసాధ్యకర్మ నెటులైనను సాధింపవలయునను పూనికగల గుటెన్‌బర్గ్ దృష్టిలో నొకవిధానము మెఱుపై మెరసెను. కఱ్ఱదిమ్మెలను వాడుటకంటె విడి అక్షరములను సిద్ధము చేసినచో వాని నొకపుటకు కావలసిన శబ్దములలో గూర్చుకొనవచ్చును. ముద్రణమైన పిమ్మట విడదీసి మఱియొక పుటకొరకు వాడుకొనవచ్చును, కావున ముద్రణమునకు చలనాక్షరములు (Movable Type) ఎంతయు నావశ్యకములని స్ఫురించెను. అట్టి చలనాక్షరముల నక్షరాక్షరమున ననేక పుటల సిద్ధముచేసినట్లును, వానిని శబ్దములనుగా కూర్చి ఒక్క పుటను సిద్ధము చేసినట్లును, దానిపై సిరాపూసి, కాగితము వైచి పైన నొక ఒత్తిడి కలిగించి, ఒక ప్రతిని - అటులనే కావలసిన ప్రతులను ముద్రించుకొనిన తరువాత నా యక్షరముల విడదీసి మఱియొక పుటను సిద్ధముచేసి ప్రతుల దీసుకొనినటులను - ఇట్లే ఒక గ్రంథమంతయు పెక్కు ప్రతులుగా ముద్రించి, మఱియొక గ్రంథముద్రణము కూన పూనుకొనినటులను, ఈ విధముగా గ్రంథముద్రణమును సాగించి, ముద్రిత

గ్రంథములతో ప్రపంచమును కప్పినటులను ఆతడు మేలుకొని యుండియే కలగాంచెను.

ఆకల కల్ల గాలేదు. ఆతని కృషి విఫలముగాలేదు. ఆ కలలో నాతనికి స్ఫురించిన సంఘటనములన్నియును ఆతని వలననే కాకపోయినను నేడు మన అనుభవమునకు వచ్చి తీరినవి. ఎట్లయినను ముద్రణ కళాసృష్టికి గుటెంబర్గే స్రష్ట యను ఖ్యాతి కలిగెను.

గుటెంబర్గ్ తనకు తోచిన భావమును ఆచరణలోనకు తేసాగెను. మొదట నాతడు ప్రత్యేక ప్రత్యేకముగా నొక్కొక్క అక్షరమును పెక్కు ప్రతులనుగా కఱ్ఱకోపుల (Wooden-Sticks)పై చెక్కెను. వానివలన తన ఉద్దేశానుసారమతి ప్రయాసపడి ముద్రణ కార్యమును నిర్వహించెను. జనులు తండోపతండములుగా వచ్చి ఆ విచిత్రమును చూచి పోసాగిరి. ఆతని గుఱించి చేసెడు శ్లాఘనలు నలుదిక్కుల మాఱు మ్రోయసాగెను. ఆతని కృషి ఒక విధముగా ఫలోన్ముఖ మయ్యెను.

కఱ్ఱ మెత్తని దగుట, కఱ్ఱకోపులపై చెక్కబడిన అక్షరములు దెబ్బదిని సులభముగా చెడిపోవుచుండెను. కొన్నిపుటలు ముద్రించునప్పటికి అక్షరముల స్వరూపము చెడి, మఱల వాడుకొనుటకు నిరుపయోగ మగుచుండెను. అపుడు మఱల కఱ్ఱకోపులపై నక్షరములను చెక్కవలసి యుండెను.

కార్యము ఫలోన్ముఖమగుట కీశ్వరుడాశీర్వదింపవలె గాని, క్రొత్త క్రొత్త విధానము లాలోచన రూపమున బుద్ధి లోనకు జొచ్చుచుండును. కఱ్ఱపై చెక్కుట కంటె ధాతు

శకలముల (Metal Cubes) పైచెక్కుట ఎక్కువ కాలము మనుట కవకాశమిచ్చుట అని గుటెంబర్గ్ తలచెను. కాని ఆచరణ కింక ననేకాటంకములు కలుగుచుండెను.

అద్దముల పరిశ్రమనాడు భాగస్వామిగా నుండిన డ్రిట్జెర్ గాక అండ్రూ అను నాతనిని, అర్టర్ హెయిల్మార్ అను నాతనిని తనతో భాగస్వాములనుగా గుటెంబర్గ్ చేర్చుకొనెను. వారాతనితో ముద్రణ కృషియందు పాల్గొనుచుండిరి. అయినప్పటికి మాదిరుల (Samples) ముద్రించుటతోనే కాలము గడచుచుండెను; కఱ్ఱకోపు అక్షరములే వాడబడుచుండెను.

భాగస్వాములుగా చేరిన ముద్రాపకులీ వ్యాపారమున శ్రద్ధతో పనిచేయుచు, అభివృద్ధిచింతతో నుండియుండురేమో కాని, క్రీ. శ. 1441 వ సంవత్సరమున (గుటెంబర్గ్ నకు అప్పునిచ్చి భాగస్వామిగా చేరిన) డ్రిజ్జెర్ మరణించెను. ఆతని తమ్ములు తమలో నొకరిని మరణించిన తమ అన్నస్థానమున భాగస్థునిగా గుటెంబర్గు తీసుకొనవలసి యుండునని న్యాయస్థానమందభియోగము దెచ్చిరి; కాని విజయము గుటెంబర్గునకే లభించెను.

దీని తరువాత నొక విచిత్రకాల ముపస్థితమయ్యెను. గుటెంబర్గ్ అప్పుగా దెచ్చిన ధనమంతయు పరిశ్రమలో వినియోగపడి పోయెను. అదేసమయమున భార్యకు, గృహకృత్యము లందును ధనవ్యయము చేయవలసివచ్చెను. ఆ సమయముననే గుటెంబర్గునకు తన పూర్వస్థానమగు మెయింజునకు వెళ్ళవలసిన ఆవశ్యకత తటస్థపడెను.

ముద్రణకళోత్పత్తి మూలస్థానమను గౌరవము మెయింజునకు ప్రాప్తింపవలసిన యోగముండుటచే క్రీ శ. 1446 వ సంవత్సరమున గుటెన్‌బర్గు మఱల నచ్చటికి వచ్చి చేరెను. ఆతడచ్చోటు విడచి పరదేశములకు బోయి నేటికి 26 సంవత్సరములయ్యెను.

మెయింజులో గుటెన్‌బర్గు నివసించుటకొక ఇంటిని పొంది, దాని యందొక భాగము కుటుంబనివాసమునకును, ఒక భాగము కార్యాలయమునకు ఏర్పాటుచేసికొనెను. మఱల నచ్చోట తన ఉద్యమమును సాగించి కృతకృత్యుడయ్యెను.

మెయింజునందలి సుప్రసిద్ధ వర్తకుడగు జాన్‌ఫుస్టు (John fust) నొద్ద కొంతధనమును గుటెన్‌బర్గు అప్పుగా గొనెను. ఫుస్టు అతనికి రెండు పెద్ద మొత్తముల ధనమిచ్చెను. ఆ సందర్భమున నా అప్పుగొన్న ధనమునకు భద్రతగా గుటెన్‌బర్గు తన కర్మాగారమందలి పదార్థములను పూచీగా నుంచవలసిన వాడయ్యెను. ఫుస్టు ఆ పరిశ్రమయందు భాగస్వామిగా నంగీకరింపబడుటచే సంపూర్ణ జోక్యము కలవాడయ్యెను.

ఫుస్టువలన నప్పుగాగొనిన రెండు పెద్ద మొత్తముల ధనమును వెచ్చించి గుటెన్‌బర్గు తన పరిశ్రమకు కావలసిన ధాతువులను, పరికరములను గొనజాలెను.

గుటెన్‌బర్గు, ఫుస్టు ఇద్దఱు చక్కగా విచారించి ధాతు కర్మయందు మిక్కిలి నేర్పరియగు షోఫ్ఫర్ (Sehoeffer) అను నాతనిని తమ పనిలోనకు గొనిరి. విడి అక్షరముల నిర్మాణ కర్మయందు అతడు మిక్కిలి నేర్పరిగను, బుద్ధి వినియోగించి

ఉపయోగాంశములను నిర్ణయించువాడుగ నుండెను. ఆతడు గుటెన్‌బర్గున కొసగిన సూచన మిగుల యోగ్యమైనదియును, అవ్యర్థమైనదియును నై యున్నది.

షోఫ్ఫర్ ఒక లోహపు మొలకొనపైన నొక అక్షరమును చెక్కెను. దాని నొక మూస (Mould) పైన నద్ది మెత్తని ధాతువును కలిగించి ఆ మూసకు చేర్చెను. ఈ విధముగా నొక్కొక్క అక్షరము మితికి మీరిన సంఖ్యలో సులభముగను- త్వరగను సిద్ధమయ్యెను.

గుటెన్‌బర్గు జీవిత మీనాడు ఆరంభమయ్యెను. సిద్ధమైన అక్షరములతో మొదట పవిత్ర గ్రంథమగు 'బైబిల్'ను ముద్రింప నాతడు సంకల్పించెను. అయినను ఈ కార్యము కొఱకు అచ్చుమొలల పోతపోయువారు (Type Founders), వానిని జోడించువారు (Compositors), నిర్దుష్ట మొనరించువారు (Proof Readers), పుటలుగా సవరించువారు (Chase-men), ముద్రించువారు (Machin-men), పుటల చేర్చువారు (Formators), పుస్తకములగుట్టువారు (Book-Binders) మొదలగు వారనేకులు కావలసి యుండెను. వారికొఱకు ధనోపపత్తి లేదు.

ఎట్లయిననేమి క్రీ. శ. 1455వ సంవత్సరమున సంపూర్ణముగా బైబిల్ రెండు సంపుటములుగా లాటిన్ భాషయందు ముద్రింపబడి, ప్రపంచమునకు ప్రసాదింపబడెను. ముద్రణ కార్య విజయోత్సాహము సుస్థాపితమయ్యెను. 'చేతివ్రాత వలె సుస్పష్టమైయున్న' దనియు—— 'ఏకకాలమున ననేక ప్రతులు సిద్ధమయ్యెననియు', 'చేతివ్రాత ప్రతికంటె వెల తగ్గియున్న'

దనియు- 'చేతివ్రాత ప్రతికంటె నతిత్వరితముగా ప్రతిలభించు' ననియు జనులు శ్లాఘించిరి. గుటెన్‌బర్గు కోరినకోరికలలో- ఆరంభించిన ఉద్యమములో ఫలింపనిదింకేది గలదు?

కాని గుటెన్‌బర్గు అదృష్టరవి ఉదయించిన వెంటనే అస్తమించెను. బైబిల్ పూర్తిగా ముద్రించుటయే తడవుగా వివాదలు సంప్రాప్తము లయ్యెను. ఎట్లయిననేమి గుటెన్‌బర్గేమి, అతని భాగస్వాములేమి ముద్రణకళయొక్క ప్రథమ ఫలముగా పవిత్రమగు బైబిల్ గ్రంథమును ప్రపంచమున కీయజాలిరి.

ఈ కార్యము ముగిసినంతనే జగడములు చెలరేగెను. లోభియైన ఫుస్టు తానిచ్చిన అప్పు చెల్లింపుమని గుటెన్‌బర్గును తొందరపెట్టెను. గుటెన్‌బర్గు తనఅప్పును చెల్లింపజాలడనియు, అప్పు క్రింద ముద్రణోద్యమము పరికరములసహా తన వశమగు ననియు ఫుస్టు బాగుగా యెఱుగును.

న్యాయానుసారముట్లు చేయుట కొంతవరకు బాగుగనే యున్నది ; కాని ఆ న్యాయములోనే భయంకరమగు క్రౌర్య ముగలదు. నిర్భాగ్యుడగు గుటెన్‌బర్గు తన విజయమువార్త మునందే తన కార్యస్థానముపై నొక తన్ను దన్నెను. అతడు ప్రేమించుచుండిన ముద్రణాలయము - ముద్రణశాపంత్ర మోప కరణములు ఫుస్టునకును, షోఫ్ఫర్‌నకును మిగిలి పోయెను. ముద్రణ కళకు సంబంధించిన ఊహకలిగిననాటికంటె గుటెన్‌బర్గు దరిద్రుడై పోయెను.

గుటెన్‌బర్గునకు త్వరలో మరియొక స్నేహితుడు లభించెను. ఆతడొనరించిన ధన సహాయమున మఱియొక

ముద్రణాలయమును స్థాపింపజాలెను. కాని, ఒకటి రెండు పుస్తకములు ముద్రింపబడిన పిమ్మట అచ్చుశాల నడువజాలక పోయెను. తరువాత గుటెన్‌బర్గు నిరుద్యోగియై, మెయింజు నందలి క్రైస్తవమత ప్రధానగురువు (Archbishop) దాతృత్వచ్ఛాయ దన దినములను ముగించుకొనెను.

గుటెన్‌బర్గు దేహచ్యుతి నెప్పుడు పొందినది ఎవరెఱుగరు. కాని ప్రపంచమందలి మహాపురుషులలో నాతని నొకనినిగా నొనరింపజాలిన బైబిల్ ముద్రణానంతరము పదమూడు సంవత్సరములకు అనగా క్రీ॥ శ॥ 1468 వ సంవత్సరమున నాతడు నిర్యాణ మొందియుండును.

ఆతని నిర్యాణానంతరము దాదాపు నాలుగు శతాబ్దములు గడచిన పిమ్మట మెయింజ్ పౌరులు గుటెన్‌బర్గు గౌరవార్థము - స్మారక చిహ్నముగా నాతని శిలావిగ్రహమును మెయింజ్‌నందు స్థాపించిరి. కాని అప్పటికే ఆతని ధవళకీర్తి ప్రపంచముయొక్క ప్రతిభాగమునందును, ఇండ్లు కట్టుకొని కాపురము చేయుచుండుటచే ఈనాడా కార్యమునకు ప్రసక్తియే లేకుండెను.

బైబిల్ గ్రంథము ముద్రణమైన 16 సంవత్సరములకు ఇటలీ, జర్మన్ దేశములందు ముద్రణ కార్యము ఆచరణకు తేబడియెను. స్ట్రాస్‌బర్గు - కొలగ్ని - రోం - ఫ్లోరెన్సు - నేపిల్సు - బోలగ్నా - మిలన్ మొదలగు ప్రదేశములందు ముద్రణాలయములు ఎగురుచు వచ్చి వ్రాలెను. రోసెస్‌తో మూర్ఖమగు యుద్ధమునందు నిమగ్నమైయున్న ఇంగ్లండు మాత్రము ఈ అద్భుతమునుగురించి యేమాత్ర మెఱుగదు.

అయినను ఇంగ్లండుకొరకు సైతము ఒక సుసమయము, ఒక సుజనుడు ఏర్పడియేయుండెను.

ఇంగ్లండునందు ప్రథమముద్రణము క్రీ॥ శ॥ 1477 లో జరిగెను. ముద్రణకార్య మారంభమై, బైబిల్ ముద్రింపబడిన తరువాత ఇంగ్లండునందీ శుభోషన్నునకు తరి చిక్కుటకు చాలా ఆలస్యము పట్టెను. అప్పటికిపూర్వము ఏబది యేండ్ల వరకు ఇంగ్లండునందు ఇంగ్లీషుభాష నేర్పబడుచుండుటలేదు. ఉన్నతవర్గములవారికి చదువు.వ్రాతలకొరకు ఫ్రెంచిభాష నేర్ప బడుచుండెనే కాని ఇంగ్లీషుకాదు. ఇంగ్లీషువ్రాత లేనేలేదు; పత్రములు, జాబులు ఫ్రెంచిభాషలోనే వ్రాయుచుండిరి. దీనిని నార్మనులు తమవెంటదెచ్చి పాదుకొల్పిరి.

ఇంగ్లండునకు ముద్రణకళను కొనితెచ్చినది విలియం కాక్స్టన్ (William Caxton). ఇతడు వెంటర్ డెన్‌లో జన్మించెనందురు. కాని దానినెవరు విశ్వసింపక కెంట్‌నందు క్రీ. శ. 1422 వ సంవత్సరప్రాంతమున జన్మించెనని చెప్పెదరు. ఈతడు గుటెన్‌బర్గు కంటె దాదాపు 12 సంవత్సరముల వయసున చిన్నవాడు. ఆనాళ్ళలో తలిదండ్రులు తమపిల్లలకు విద్య నేర్పింపకుండిరనిన నది మనకొక వింతగా నుండును. తక్కినవారివలెగాక తన్ను పాఠశాలకు దోలి విద్య నేర్పించి నందుకు కాక్స్టన్ వృద్ధుడై కూడా తన తల్లిదండ్రులను స్తుతించు చుండువాడట.

కాక్స్టన్‌ను పాఠశాలకు తోలునపుడు ఆతని తల్లి దండ్రుల కేపెద్దఉద్దేశమో లేకుండెను. ఇంగ్లీషు మాతృభాషగా

చదువుకొని ఎట్టి పెద్దపని చేయజాలెదగు అని వారి కొక నిరాశ—ఉదాసీనత యుండెడిది.

బడినుండి వదలబడిన పిన్నట కాక్స్టన్‌ను ఆతని తల్లి దండ్రిలు భాగ్యవంతుడగు నొక బట్టల వర్తకునియొద్ద పని నేర్చుకొనువానిగా నియమించిరి. ఆ వర్తకుడు దినక్రమమున స్వామియయ్యెను - లండన్ నగరమునకు మేయర్ యయ్యెను. పెద్దపదవుల నందుచున్నను ఆతనికి కాక్స్టన్‌పై గల ప్రేమ పోలేదు; ఎప్పుడాతని శుభచింతకుడుగానే యుండెను. ఆ వర్తకుడు చనిపోవునపుడు ఒక పెద్ద మొత్తముధనమును కాక్స్టన్‌కు వదలి పోయెను.

వర్తకునియొద్ద అభ్యర్థిత్వమును నిర్వహించి వచ్చిన పిన్నట కాక్స్టన్ బ్రూగెస్‌నకు వెళ్ళెను. అపుడాతనికి 24 ఏండ్ల ప్రాయము-ఏదేనివృత్తి పెట్టుకొనుటకు చాలియుండెను. బ్రూగెసునందలి ఇంగ్లీషు వర్తకులు పెక్కండ్రు ఆతనిని పని లోనకు గొనిరి. కాక్స్టన్ సమర్థుడును, కుశలుడును; కావుననే కొద్దినాళ్ళలో బాగుపడెను. ఆతడు బ్రూగెసు చేరిన నాలుగు సంవత్సరములకు తరువాత, నొక వర్తకునకు 110 పౌండ్ల ధనము నప్పుగా నిచ్చెనను యథార్థవిషయము ఆతని శీఘ్రాభి వృద్ధికి సాక్ష్యమిచ్చుచున్నది. అక్కడనున్న ముప్పదేండ్లలో నాతడు రెండుసారులు మాత్రమే ఇంగ్లండునకు వచ్చెను. తన్ను స్వయముగా నాత డనేక విద్యానాథునిగా నొనరించు కొనెను. బ్రూగెస్ నందాత డింగ్లీషువారి రాయబారిగా నుండెను. ప్రభుత్వమున కాతనిపై విశ్వాసదృష్టి యుండెను.

యూరప్‌నందు ముద్రణకళ శీఘ్రవ్యాప్తి నందెను. తొలుత ముద్రణోద్యమ మెచట ఆరంభమయ్యెనో ఆ మెయింజ్ నగరము కొల్లపెట్టబడెను. క్రీ. శ. 1462 సంవత్సరమున జరిగిన ఈ కొల్లలో షోఫ్ఫర్, ఫస్టుల ముద్రణాలయము ధ్వంసము కావింపబడెను. పనివాండ్రు వెళ్ళగొట్టబడిరి. వారు తమకుగల ముద్రణ కార్యమునందలి అనుభవమును వెంటగొని యితర దేశములపాలైరి. ఫస్టు దురదృష్టమిట్లు మాఱురూపముతో నితరుల నాశీర్వదించెను. ఫస్టు సంపాదించిన పుస్తకములు - ముద్రించిన పుస్తకములు కాక్స్టన్ చేతికి చిక్కెను.

కాక్స్టన్ తన ఏబదిఏండ్ల ప్రాయమున తన మనస్సునకమితానందము గొలుపుచుండెడు నొక పుస్తకమును ఇంగ్లీషు భాషలో కనువదించి ముద్రించెను.

కాక్స్టన్ స్వయముగా నక్షరములను జోడించి, ముద్రించుచుండువాడో, మఱియొకని నియమించెనో తెలియదు. కాని కొలగ్నిలో సుప్రసిద్ధ రచయితగా నుండిన కోలార్డుమాన్షన్ సాహచర్యమున నెక్కువగా నుండెడివాడు. తరువాత కోలార్డుమాన్షన్ కూడా ముద్రాపకుడయ్యెను.

వెస్టుమినిష్టర్ అబ్బేకు సంబంధించిన ఆవరణమునందు కాక్స్టన్ తన ముద్రణాలయము పెట్టుకొనియెనని కొందరును, వెస్టుమినిష్టర్‌నందు రాజుచే నిర్మింపబడిన భిక్షుకుల గృహముల (Alms houses) లోనో, వాని దాపుననో ఆతని కార్యాలయముండెనని కొందరు చెప్పెదరు.

ఆనాళ్ళలో కాక్ట్సన్ ముద్రణకార్యమువలన తీరుబడి లేనివాడుగా నుండెను. చిన్నకథలు - కరపత్రములు చాసర్ - (Chaucer) రచనలు - మతగ్రంథములు కాథోలిక్కుల పాఠాంతరములు (Versions) మొదలగువాని నెన్నింటినో ముద్రించుచుండెను. అవి యన్నియు నిపుడు లేకున్నను-ఇప్పటికి మిగిలియున్న కాక్ట్సన్ గ్రంథములు రెండువేల పౌన్ల వెలకు సరిపోవునన్ని గలవు.

ముద్రణ కార్యమున కాక్ట్సన్‌కు సాయపడుచున్నవాడు వింకెన్ డివోర్డు (Wynkyn de worde). అతడు బెల్జియం నుండి వచ్చినవాడు. క్రీ. శ. 1491 వ సంవత్సరమున కాక్ట్సన్ మరణించునప్పటికి ముద్రణ కార్యములయందతడు ప్రవీణుడయ్యెను. తన యజమానియగు కాక్ట్సన్‌చే ఆరంభింపబడిన ముద్రణకార్యము నాతడు అభివృద్ధికిదెచ్చి నాలుగు వందలకు పైగా పుస్తకముల ముద్రించెను.

కాక్ట్సన్ మరణమునకు ముందు ఇంగ్లండునందు ముద్రణ కార్యము మిక్కిలి ముందునకు వచ్చెను. థామస్ రూడ్ (Thomas Rood) వలన ఆక్స్ఫోర్డు నందొక ముద్రణాలయము- సెయింట్ ఆల్బన్సు నందొక ముద్రణాలయము- లెట్టో (Lettou)అను నాతని వలన లండన్ నగరమందొక ముద్రణాలయము- స్థాపింపబడెను. తన మొదటి అచ్చుశాలను స్థాపించుటకు కాంబ్రిడ్జి నలుబదియేండ్లు నిరీక్షించెను. క్రీ. శ. 1507 లో స్కాట్లాండు నందు మొదటి అచ్చుశాల స్థాపింపబడెను. దాని స్థాపకులలో నొకడు ధనికుడగు

వాల్టర్ చెప్‌మాన్, రెండవవాడు పుస్తక విక్రేతయగు ఆండ్రూమ్యాల్లర్, ముద్రాపకులుగా నుండుటకు వారు స్కాట్ లాండు రాజునొద్ద నాజ్ఞాపత్రమును పొందిరి.

ముద్రణ వ్యాపారము అమెరికాకెగ ప్రాకెను. క్రీ. శ. 1536 వ సంవత్సరమున మెక్సికోనగరమున ప్రథమ ముద్రణాలయము స్థాపింపబడెను.

ప్రారంభదశయందు అచ్చు బాగుగా నుండకుండెడిది. తరువాత క్రమక్రమముగా నెన్నియో సంస్కరణములు జరిగెను. అక్షరముల చక్కబరుచుట వికిన్ డివోర్డు వలన జరిగెను. దానియందెక్కువభాగము రిచర్డు పిన్సన్ వలన చక్కబెట్టబడెను. పరదేశీయుడగు కాక్స్టన్ ముద్రణకార్యమును లండన్‌కు దెచ్చెను. పిన్సన్ రాజపత్ర ముద్రాపకుడయ్యెను. అతడు ముద్రణ కళను శ్లాఘనీయముగా నిర్వహించుచు రోమన్ అక్షరములలో ప్రథమ గ్రంథమును ముద్రించెను.

ఆకాలమున ఆదేశమందలి ఉత్తమ ముద్రాపకులలో వెనిస్ నందలి ఆల్డోమానుజో ప్రథమగణ్యుడు. అతడు క్రీ. శ. 1446లో జన్మించెను. ఇటాలిక్ అక్షరములలో మొదటి గ్రంథమును ముద్రించిన మహానుభావుడితడే.

అచ్చుశాలలు విశేషవ్యాప్తిగాంచి, వివిధ గ్రంథ ముద్రణము ఉచ్ఛృంఖలమై, ఆ సారస్వత పర్యవేక్షణ ఫలితమగు జనుల బుద్ధియందలి మార్పు ప్రభుత్వమునకు భీతిదాయి యయ్యెను. ఇంగ్లండునందు క్రీ. శ. 1530 లో అచ్చుశాలల చట్టము ఆవిర్భవించెను. ప్రతిముద్రిత పత్రము విమర్శనమునకుగాను ప్రభుత్వమునకు పంపవలయును. అందలి గుణదోష

ములకు వారుత్తర వాదులు. విచక్షణము (Censor) నందు దోషము కనపించినపుడు ముద్రాపకులు కఠినముగా శిక్షింపబడుచుండిరి.

ఈ స్థితి 150 సంవత్సరములకు పైకాలముదాకా నిలిచియుండెను. దాని కారణమున ఆ నాళ్ళలో ముద్రణకళ బొత్తిగా సన్నగిల్లెను.

సెన్సార్ పద్ధతి తొలగిపోయినంత జనులు తమనుండి వెడలిపోయిన ముద్రణాశను మరల వెతకి తెచ్చుకొనిరి. ముద్రణకార్యము త్వరలో నారంభమయ్యెను. మంచి మంచి రకముల అచ్చుమొలలు, మంచి మంచి రకముల ముద్రణ యంత్రములు సిర్మింపబడెను. అంతకు పూర్వము అచ్చుమొలలు ప్రెస్సులో పరుండబెట్టి, సిరాపూసి, దానిపై కాగిదము బరచి, చేతితో నద్దెడు విధానముండెను. తరువాత చేతికి బదులు కొయ్యపలకపై మెత్తనిబట్ట, కాగిదముల నంటించి దానిచే నొత్తించు విధానములు లోనకు వచ్చెను. తరువాత పరుండ పెట్టిన అక్షరములపై సిలండర్ దొరలుచు ఒత్తిడి కలిగించు విధానము వచ్చెను.

క్రీ. శ. 1814 వ సంవత్సరము దాక ఏ వార్తాపత్రికయు ఆవిరి ముద్రణయంత్రమున ముద్రింపబడలేదు. ఆవిరి యంత్ర నిర్మాత ఫ్రెడరిక్ కోనిగ్. ఇతడు జర్మనీలోని ఈస్లీబెన్ నగరమున క్రీ. శ. 1774లో జన్మించెను. ఇతడు అచ్చు అక్షరముల పోతపోయు మూస (Matrix) ను కనిపెట్టెను. ముద్రణ యంత్రమున నక్షరములపై సిలండర్ దొరలిపోవుచుండునట్టి

సిలిండర్ యంత్రమును కనిపెట్టి ముద్రణమునందు శీఘ్రత, సులభతలను కలుగ జేసెను.

ఈతని కాలముననే నికాల్సన్ అనునాతడు కూడా సిలండర్ యంత్ర నిర్మాణమునకు ప్రయత్నించెను. కాని, కోనిగ్ నిర్మించిన యంత్రమే చక్కగ పనిజేసెను.

కోనిగ్ పరిశ్రమ టైమ్సు పత్రికాధిపతియగు జాన్ వాల్టర్‌కు ఎక్కువ ఉపయోగపడెను.

దినములు గడచినకొలది ముద్రణకళ అభివృద్ధినొందెను. కూర్పు లేక కూర్చు పని, పంచివేయని పంపకము, అందీయక కాగిదము నందుకొనుట, తీయకుండ కాగిదము బైటపడుట, లెక్కింపక లెక్కకు వచ్చుట- ఇట్టి అనేక సంస్కరణములు కల్పింపబడెను; ఇంకను కల్పించు యోచనలు ముగియలేదు.

ప్రతి దేశమున- భాగభాగమున ముద్రాక్షరశాలలు నేటి దినము కన్నులకు పండుగ జేయుచున్నవి. పల్లెలలోను, పట్టణములలోను, ప్రదేశమునకు తగినన్ని ముద్రణాలయములు కలవు. ఇంకను కొన్ని పల్లెపట్టులు మిగిలియుండిన నుండును. త్వరలో నా ప్రదేశములు కూడా ముద్రాక్షరశాలా విరాజితము కాకతప్పవు.

ముద్రణకళ ఆరంభమెప్పుడయ్యెను, కళాద్రష్ట లెవరనుటను మన మొక్కింత తెలసికొంటిమి. ముద్రణకళను కనిపెట్టిన యాతడు భారతీయుడను గౌరవము మనకు దక్కలేదు- కాని సిద్ధకల్పమైన ఈముద్రణ కార్యము పడమటి దేశములనుండి

హిందూ దేశమునకు వచ్చినప్పుడు ప్రథమ స్థాపన గౌరవ మైన యే పట్టణమునకు కలిగెను, ప్రథమస్థాపకులు వీరని గౌరవ మే మహామహులకు కలిగెను, ప్రథమ స్థాపనమున నే సంవత్సరము గౌరవ భాజనమయ్యెను అను మొదలగు కొన్ని అనుకరణ విషయములైన మనము వినజాలిన నెంతో బాగుండి యుండెడిది.

J. Parthasarathi



# చార్లెస్ డార్విన్

................

## శ్రీ తిరుమల శ్రీనివాసశర్మ

ఆధునిక విజ్ఞానమువలన మానవుని ప్రాతనమ్మికలలో ననేకములగు మార్పులు కలిగినవి. అట్టివాటిలో చార్లెస్ డార్విన్ పరిశోధనలు చేసినంత మార్పును మరేవియు చేయ లేదనవచ్చును. అతడు జీవశాస్త్రము ( ప్రాణిశాస్త్రము ) ను గురించి చేసిన పరిశోధన లీవరకు జనులలో నుండు విశ్వాసముల తలక్రిందుచేసినవి. ఖగోళవిషయమున కెప్లర్, గెలీలియో, కోపర్నికస్ మున్నగువారు చేసిన మార్పులకన్నను ఈయన తెచ్చిన మార్పద్భుతము! భూమి గుండ్రముగనున్న దనియు, నది సూర్యుని చుట్టుచున్నదనియు చాటి, అంతకు ముందు జనులలోనున్న పురాతన విశ్వాసముల వారు తొలగించిరి. అయిన నేడు ప్రాణికోటిలో నగుపడు వందలకొలది జాత్యుప జాతులెట్లు కలిగినవను సంగతిని విశదీకరించు డార్విన్ పండితుని పరిశోధనలు జనులలోనున్న విశ్వాసముల మరింత కెరలించుటకు కారణములైనవి.

చార్లెస్ డార్విన్ ఆంగ్లదేశీయుడు. ఇతని తండ్రిపేరు డా. రాబర్టు డార్విన్. ఇతడు ష్రూబెరీయను చోట 1809 లో జన్మించెను. పిన్ననాటనే యితడు పల్లెబడికి పంపబడెను. ప్రకృతి విజ్ఞానవిషయములనిన చిన్నతనము ( ఎనిమిదేండ్ల వయసు ) నుండియే చెవికోసుకొను స్వభావమతనిది. తన

యభిరుచికి సరిపడనిదగుటచే పాఠశాలలోని విద్య యితని నాకర్షింపఁజాలదయ్యె. పెద్దవాఁడగుసరి కతనిని వైద్య విద్య నభ్యసించుటకై డా. రాబర్టు ఎడింబరో పట్టణమునకు బంపెను. కాని, రెండు వత్సరములకన్న నెక్కువ కాలమదియు సాగ లేదు. ఆపైని ధార్మిక శిక్షణమునకని కేంబ్రిడ్జికు పంపబడెను. ధర్మశోధ డార్విను నకు రుచింపనిదికాగా, నచటి (కేంబ్రిడ్జి) నుండి విజ్ఞానశోధనకై దక్షిణ అమెరికాకు పోవుచున్న హెన్స్లో అను పండితుని పరిచయ మీతనికి కలిగినది. అప్పుడు హెన్స్లో వెంబడి తానును పరిశోధనార్థము పోవలయునని యెంచి వేతనములేకయే యీతనిని డార్విన్ వెంబడించెను.

దక్షిణ అమెరికా యందైదు సంవత్సరముల పాటుండి యనేక ప్రాంతములను దర్శించుటచే కలిగిన యనుభవ మతని భావి జీవిత లక్ష్యమును నిర్ణయించినది. ప్రాణి జీవితముల పరిశీలనములో నతనికిగల యభిరుచి యింకను ననేక నూతన్నసిద్ధాంతములను చేయుటకు సాధ్యపడినది. అతడచట నున్నప్పుడనేక ప్రాణులను, వాటి యవశేషము లనదగు శిలామయశరీరములను (Fossils) పరిశీలించి, పరిశోధనల జేయసాగెను.

దక్షిణ అమెరికానుండి కెంట్ అను పట్టణమునకువచ్చి, జీవనపు టితర విషయములకు బోక నెడతెగని వ్యాసంగమునకు డార్విన్ పూనుకొనెను. అచట నతిసారముచే దినదిన మాతని యారోగ్యము కొరవడసాగినది. అయినను లెక్కగొనక పెక్కు గ్రంథములను జూచుచు, తాను దక్షిణ అమెరికాలో సంగ్రహించిన విషయములను గుఱించియు పరిశోధింపసాగించెను.

ఒక్కవైపతనిలో విజ్ఞాన విషయమున బయలుదేరిన జిజ్ఞాసయు వేరొకవైపు దేహారోగ్యసమస్య—యీ రెండును ముప్పది యబ్దముల పాటతనిని కలచి వైచినవి.

1859 లో నితడు తన దీర్ఘకాల పరిశోధనల ఫలితముగ మొదటిదగు 'The Origin of Species' ప్రాణి జాతుల మూలము—అనుగ్రంథమును బ్రకటించెను. దాని ముద్రణము సంపూర్ణమగుటతోడనే యతడు పట్టరాని సంతోషమున "నా పుణ్య విశేషము ! మనశ్శరీరముల కొక్కమ్మడి విశ్రాంతి లభించినది. నామనసులోని సంగతులన్నిటిని నేటికి గదా బయలుపరుపఁ జాలితిని!" అని తలపోసెను.

నిజముగ నతని మనోభారమును నాతని పుస్తకము సన్నగిల జేసినది. అయిన నితరులనది మిక్కిలి బాధింపసాగినది. ఆ దినములలో నతని సిద్ధాంతములను బ్రతివారును నిందింపసాగిరి. కొందరు మాత్రము- సర్ జాన్ లబక్, మరియు టి. హెచ్. హక్స్లే వంటి వైజ్ఞానికులు అతని యాలోచనల బలపరచిరి.

1860 లో డార్విన్ ప్రకటించిన పరిణామ వాదమును గురించి ఆక్స్ఫర్డులో మిక్కిలి చర్చలు జరిగెను. మఱియు నాక్స్ఫర్డులో జరిగిన బ్రిటిష్ ఎసోసియేషన్ సభలో బిషప్. విల్బర్ఫోర్సను నతడు డార్విన్ సిద్ధాంతమునకు మండిపడి వ్యతిరేకముగ నుపన్యసింపసాగెను. అతడు డార్విన్ పరిణామ వాదులను తిరస్కరించుచు—"ఈ వాదమున నిజములేదు. అడవి పావురములు (Rockpigeons) ఇప్పుడెట్లున్నవో యింతకు ముందట్లేయుండినవి.........ఈ సిద్ధాంతకారుని

(డార్విన్) పెద్దలలో నీతని తాతయూ లేక ముత్తాతయూ కపివంశములోనివా''డని పరిహసించెను. అప్పుడచటనే యున్నట్టి టి. హెచ్. హక్స్లే బిషపును నోరు మూయునట్లు చేసెను. "మనుష్యుడు తన పెద్దలు వానరులుగదాయని సిగ్గిల నక్కరలేదు. ఒకవేళ నట్లుచేయవలసిన నిపుడుపన్యసించిన వారికై సిగ్గుపడవలసి యుండును. తనపనిలో నధికారమబ్బిన దని, విజ్ఞాన మార్గమున నేమాత్రము పరిచయము లేక మిగుల తెలిసిన వాడనని విఱ్ఱవీగు వానికై సిగ్గుపడవలయును" అని ప్రత్యుత్తర మొసగెను.

డార్విన్ తాను వ్రాసిన గ్రంథమున కుత్తరార్థమను నట్లు ౧౮౭౧ లో "Decent of Man"— మానవావతర ణము— అను గ్రంథము వెలయించెను. డార్విను సిద్ధాంత ములలో సామాన్యముగ వివిధ ప్రాణులు జన్మించుటకు స్థూలకారణముకలదు. ప్రకృతిలో బలశాలియైనదే జీవించు ననియు "Servival of the Fittest", నేడగుపించు ప్రాణి సంతతికి— దాంపత్య క్రీడానియమములు, పరిసరముల పరిణామములు మొదలగునవి కారణములనియు నతడు చాటెను. అతడు తన స్థూలసిద్ధాంతములకు, నికరములగు నుదాహరణముల జూపి వైజ్ఞానికులను మెప్పించెను. నేడతని సిద్ధాంతములపై నాధారపడిన నేకోదాహరణములు లభించి నవి. కొన్నిటిని జను లనుమోదించినను, సామాన్యముగ వాటిమూలతత్వములను వైజ్ఞానికు లొప్పుచున్నారు.

1882 లో డార్విను పండితుడస్తమించెను. అతని జీవితము కపటమెఱుగనిది. ధారాళమగు బుద్ధి, విరామమెఱుగని పరిశ్రమ, విచారసరణి, సాహసములతనికి చిరకీర్తిని గడించినవి. కావుననే యతని శరీరమును (ప్రసిద్ధులకు మాత్రము లభించు) వెస్ట్మినిస్టర్ అబేలో విశ్రమింపజేసిరి.



# గ్రీకు పురాణ దేవతలు

శ్రీ ఆదిరాజు వీరభద్రరావు

## యురేనసు ( Uranus )

ప్రారంభమున విశ్వమంతయు అస్తవ్యస్తముగా నుండెను. అప్పుడు "ప్రేమ" ప్రబలి వివిధ సృష్టికి దోహదము కలిగించెను, ఆ ప్రాచీన మానవులకు, పైన ఆకాశము కనిపించుచుండెను. క్రింద భూమి కనిపించుచుండెను. గ్రీకు భాషలో ఆకాశమునకు "యురేనసు" అనిపేరు. భూమికి "గీయా" అనిపేరు. ఆకాశము, భూమి కలియుచున్నట్లు వారికి దృష్టిగోచరమగుచుండెను. భూమిపయి పర్వతములు, సాగరములు, వృక్షములు వివిధములయిన జీవరాసులు జనించుచుండెను. యురేనసు పురుషుడు, గీయా స్త్రీ అని వారు భావించిరి. ఈ విధముగా ఆకాశము దేవతామూర్తి మంతమయి, యురేనసు నామమును వహించెను. భూదేవతా రూపమయిన గీయాను యురేనసు పెండ్లి యాడెను. వీరే గ్రీకు పురాణములలో కనబడు ఆదిదేవతలు. ఆదిదంపతులు. యురేనసు పితృస్వరూపుడు. గీయా మాతృస్వరూపిణి,

ఈ దంపతులకు బహుళసంఖ్యలో సంతానము కలిగెను. టిటనులు, సైక్లోప్సు అను రాక్షసులు, మొదలగువారుజనించిరి. వీరందరు మహాకాయులు. ఈ దేవతాకుటుంబములో పరస్పర

విద్వేషములు, విద్రోహములు ప్రబలసాగెను. తనపంతాన మగు రాక్షసుల మూకను జూచి యురేనసు ఏవగించుకొని, వారినందరను టార్టారను గుహలో బంధించెను. ఇట్టి క్రూర కార్యమును సహించలేక "గీయా" దేవత తనకొడుకులతో కుట్రపన్ని మగనిపై పగసాధింప దలచెను. టిటనులు తండ్రిపై తిరుగ బడిరి. తల్లియాజ్ఞాప్రకారము ఆమె కనిష్ఠ తనయుడగు "క్రోనోసు" తండ్రిపై విక్రమించి, అవినీతికరముగ అతని వట్టలు నలగగొట్టెను. వాడియయిన కొడవలితో తండ్రిని ఖండతుండెములుగా నరకెను. యురేనసు రక్తమునుండి క్రొత్త రక్కసిమూక యుద్భవించెను. యురేనసు తర్వాత క్రోనోసు విశ్వపాలన కార్యమును వహించెను.

## క్రోనోసు - శాటరను (Cronos - Saturn)

ఇతని తండ్రి యురేనసు. తల్లిగీయా. యురేనసు తరువాత విశ్వపాలనాధికారము వహించిన దేవుడు. ఈ దేవుని రోమనులు "శాటరను" అని పిలుచుచుండిరి. ఇతడు సోదరి యగు రహియాను వివాహము చేసికొనెను. ఈమె సిబెలి అనుపేరుతో దేవతల మాతృదేవతగా పూజనీయురాలయ్యెను.

క్రోనోసు క్రూరస్వభావము గలవాడు. యురేనసు తన కొడుకుల గుండగములను జూచి విసుగుజెంది వారిని నిర్బంధించెను. అప్పుడు కొడుకులందరు తండ్రిపై తిరుగబడిరి. ఈ తిరుగుబాటులో ప్రముఖపాత్రను క్రోనోసు వహించెను.

క్రోనోసు తన తండ్రిని పట్టలు నలగగొట్టియు కొడవలితో నరికియు చిత్రవధపాలుచేసెను. తన సంతానమువిషయమునను అక్రూరముగా ప్రవర్తించెను.

ఇతనికి రహియావలన హెస్టియా, డిమెటరు, హీరా అను ముగ్గురు కుమార్తెలును, ప్లూటో, పోసైడను, జ్యూయసు అనుముగ్గురు కొడుకులును గలిగిరి. క్రోనోసు తన సంతానములో నొకరిచే పదభ్రష్టుడగునని దైవజ్ఞులు సూచించుటచే అతడు తన భార్యయగు రహియా ప్రసవించగనే శిశువును మ్రింగివేయసాగెను. ఇట్లు హెస్టియా, డిమెటరు, హీరా, ప్లూటో, పోసైడను అను అయిదుగురు శిశువులను అతడు పొట్టను పెట్టుకొనెను. రహియా తన సంతాన రక్షణమునకు తన తల్లివలెనే పలుపాట్లు పడెను. తన మగని దౌష్ట్యమును తల్లివలెనే సహించజాలక పోయెను. రహియా తన ఆరవసంతానము—ఇతడే జ్యూయసు—జన్మించినప్పుడు, తండ్రి వీనినికూడ కబళింపకుండనుండుటకయి, ఒక రాతికి బట్టలుచుట్టి తొట్టెలో పరుండబెట్టెను. క్రోనోసు తన శిశువను భావముతో ఆరాతినే మ్రింగివైచెను. జ్యూయసు అజ్ఞాతవాసముగా పెరిగి, పెద్దవాడయిన తరువాత తండ్రిని ధిక్కరించి, ఆతనిని పదభ్రష్టుని గావించి తన అక్కలను, తనఅన్నలను, తనకు బదులుగా మ్రింగిన రాతిని మరల గ్రక్కునట్లు చేసెను. ఈ శిల చాల కాలము వరకు పర్నాసను కొండమీది పైథో దేవాలయమున చారిత్రిక చిహ్నముగా నుండెను. తరువాత నిది, డెల్ఫి

దేవాలయములలో పూజాదికములను పొందుచు, భవిష్యద్వాక్య ప్రదాయినిగా ప్రసిద్ధి కెక్కెను.

క్రోనోసు రాజ్యకాలము స్వర్ణయుగముగా నుండెను. ఈ యుగపు జాతివారు శాంతీ శమదమాది సత్వగుణ సంపన్నులయి, అమాయకులయియుండిరి. వారికి ప్రాపంచిక జ్ఞానము, విద్యావివేకములు అంతగా లేకుండెను. వారు కందమూలములను, ఫలములను భక్షించుచుండిరి. అప్పు డొక ఋతువే సంవత్సరము పొడుగునను ఉండెను. అది వసంతఋతువు. ఏకైక ఋతుప్రకృతమున వారికి పుష్కలముగా ఆహారము లభించుచుండెను. కాలక్రమమున స్వర్ణజాతి యంతరించెను.

## జ్యూయసు - జ్యూపిటరు ( Zeus-Jupiter )

జ్యూయసును రోమనులు జ్యూపిటరు అని పిలుచుచుండిరి. జ్యూయసు, జ్యూపిటరు లిద్దరు ఒక్కరేయని రోమనులు భావించిరి. అందుచే గ్రీకుల జ్యూయసు గాథలన్నియు జ్యూపిటరునకును ముడిపెట్టిరి.

జ్యూయసు తండ్రి క్రోనోసు (శాటరను). ఇతనితల్లి రహియా. తన సంతానము తన్ను పదభ్రష్టుని చేయునని దైవజ్ఞులు వచించి యుండుటచే, క్రోనోసు తన సంతానమును పుట్టగానే మ్రింగివేయుచుండెను. హెస్టియా, డిమెటరు, హీరా అను ముగ్గురు కుమార్తెలను, ప్లూటో, పోసైడను అను ఇద్దరు కుమారులను క్రోనోసు మ్రింగివేసెను. ఈ క్రూరకార్యమునకు ఈతని భార్య రహియా మిగుల దుఃఖించెను.

తరువాత రహీయూను జ్యూయసను (జ్యూపిటరు) జనించెను. ఇతడా దేవి కడపటి కుమారుడు.

రహీయూ ఈ కొమరు నయినను బ్రతికించుకొనుటకు ప్రయత్నించెను. ఈ శిశువును ఇంటినుండి రహస్యముగా తీసికొనిపోయి, తన భక్తురాండ్రగు కోరిబాంటులకు నొప్పగించి భద్రముగా కాపాడుమని యాజ్ఞాపించెను. కోరిబాంటులు ఈ బాలుని ఈడా పర్వతముమీదికి తీసికొనిపోయి ఒక కందరమునను౦చి సాకుచుండిరి.

రహీయూ తాను కనిన శిశువు విషయము భర్తకు తెలియకుండుటకయి ఒక శిలకు బట్టలు చుట్టి, తొట్టెలో పరుండబెట్టెను. క్రోనోసు ఉయ్యెలలో నున్నది తన బాలుడే యనుకొని ఆ రాతిని మ్రింగివైచెను. ఇక తన సంతానము వలన తనకు భయము లేదని నిర్విచారముగా నుండెను.

ఈడా పర్వతమున పెరుగుచున్న జ్యూయసుకు ఎట్టి లోపము రాకుండ కోరిబాంటులు శ్రద్ధ తీసికొనిరి. ఇతని కాహారముగా మేకపాలు పోయుచుండిరి. ఆ మేకపేరు అమాల్థియా.

ఈతడు దేవుడగుటచే నీతనిధ్వని గంభీరముగా మేఘ గర్జనమును పోలియుండెను. తన బాలుని రోదన ధ్వనిని క్రూర టిటనులుగాని, క్రోనోసుగాని విని, వాని రహస్య నివాసమును తెలిసికొందు రేమోయని రహీయూ భయపడెను. అందుచే రాత్రింబగళ్ళు మెలకువతో నుండి, పిల్లడు ఏడ్చినప్పుడెల్లను వాని యేడ్పు వినబడకుండునట్లుగా- పెద్దధ్వని చేయవలసినదిగా తనపూజారిణుల కాజ్ఞాపించెను. ఆ యర్చకురాండ్రు

ఆ దేవి యాదేశానుసారము చేయుచుండిరి. జ్యూయసు ఏడ్పు ప్రారంభముకాగానే, వారు ఆటలు, పాటలు ప్రారంభించి, తప్పెటలు, తాళాలు మ్రోగించి, వాని ధ్వని మరుగుపడునట్లు చేయుచుండిరి. టిటనులీ ధ్వనులు వినిరి. కాని వారికెట్టి యనుమానమును కలుగలేదు. (జ్యూయసు చనిపోయి యుండుననియే వారు భావించిరి.) వారాలు, మాసాలు గడచిపోయెను. ఆ యర్భకురాండ్రు వారినట్లే మోసగించు చుండిరి. జ్యూయసు పెద్దవాడయి, బలశాలియయి, తన భయానక వజ్రాయుధముతో వారితో పోరాడ సమకట్టు వరకు వాడు ఇంకను సజీవుడయి వున్నాడను విషయము ఎంతమాత్రము వారికి ద్యోతకము కాకుండెను.

జ్యూయసు సామాన్య మానవుడుగాక దేవుడగుటచే, అతడు అతిశీఘ్రముగా పెరిగి, పండ్రెండు నెలల ప్రాయముననే మహాయోధుడయ్యెను. ఇతడు కొన్నివారాల వయసున నున్నప్పుడు తనకు పాలనొసగుచుండిన మేక కొమ్ములలో నొక్క దానిని తనచేతులతో విరగగొట్టెనట! అతని చేతులంత బలిష్ఠమయినవి!

జ్యూయసు ఈడాపర్వతకందరమును ఇక వీడనుండగా అతడు బ్రతికియున్నాడనియు, ఎచ్చటనో దాగియున్నాడనియు, టిటనులు గ్రహించిరి. వారికి క్రోధ భయము లొక్కుమ్మడి కలిగెను. ఈ బాలదేవుని యునికి తెలియకుండుటచే వారు వాని తల్లిదండ్రులపై గవిసిరి. ఆ యుద్ధ పర్యవసానముగ కోనోసు, రహాయాలు టిటనుల చేతులలో పడిరి. టిటనులు

వారిని ఒక పర్వతమందలి యంధకారపు గుహలో బందీచేసిరి. ఇట్లు చేసినచో వారి కుమారుడెచ్చట నున్నాడో తెలుపుటకు నిర్బంధింపవచ్చునని టిటనులు భావించిరి. జ్యూయసు జనకున కావిషయమే తెలియకుండెను. జననియో మౌనముద్రను వహించెను.

జ్యూయసు యుద్ధముచేయుటకు శక్తిసామర్థ్యములు కలిగినవాడుకాగానే టిటనులపై యుద్ధము ప్రకటించెను. టిటనులు ఓడిపోయిరి. జ్యూయసు తన తల్లిదండ్రులను నిర్బంధము నుండి విముక్తి కలిగించెను. క్రోనోసు కబళించిన తన సోదరులను, తన సోదరీలను, తనకు బదులుగా మ్రింగిన రాతిని మరల గ్రక్కునట్లు చేసెను. ఇట్లు గ్రక్కబడిన హెస్టియా, డిమెటరు, హీరా, ప్లూటో పోసైడనులు స్వస్వరూపములనుదాల్చి దేవబృందమునచేరిరి.

దేవతల పతిగా ప్రపంచ భర్తగా, క్రోనోసు పట్టాభిషిక్తుడయి మరల సింహాసనము, నెక్కెను. కాని యాతడు శాత్రవులను అణచి, ఆజ్ఞలలో నుంచునంతటి శక్తిమంతుడు గాడయ్యెను. తండ్రిచేయు పాలనా విధానము జ్యూయసుకు రుచింపదయ్యెను. కావున జ్యూయసు స్వర్గలోకపుఒలింపసుపర్వత సువర్ణ మందిరాంగణములను వీడి తన సోదరులతోను, సోదరీమణులతోను ఒలింపసు పర్వతముమీద నివాసము ఏర్పరచుకొనెను. క్రోనోసును పదభ్రష్టునిచేసి జ్యూయసు పరమేశ్వర స్థానము నాక్రమించెను.

జ్యూయసు విశ్వపాలనాధికారమును వహించగానే, పినతండ్రులను, టిటనులను రాక్షసులను చెఱనుండి విడిపించెను.

ఇట్లు బంధవిముక్తులయిన టిటనులు కొందరు క్రోనోసు పక్షము వహించిరి. ఈ బాలదేవతలను గణింపకుండిరి. క్రమముగా విభేదములు ప్రజ్వరిల్ల సాగెను. టిటనులు బాలదేవతల నణంచుటకు యుద్ధమునకు సిద్ధపడిరి. టిటనులకు, దేవతలకు జరిగిన యీ సంగ్రామము పదిసంవత్సరములు ఘోరముగాసాగెను. థెసలీ ప్రాంతములో ఈ యుద్ధము జరిగినట్లు తోచుచున్నది. ఒలింపసు పర్వతము దేవతల శిబిరస్థానము. ఒత్రిసు పర్వతము టిటనుల శిబిరముగానుండెను. టిటనులు ఒలింపసు స్వర్గము నాక్రమించుటకై ఒక పర్వతముపై నింకొక పర్వతమును పేర్చి, పైకెక్క కడంగిరి. కాని జ్యూయసు వజ్రాయుధముతో వారిని పడద్రొబ్బెను. జ్యూయసు పక్షమున బ్రియారుసు అను శతభుజ రాక్షసుడు, సైక్లోపులు, ఇతర భయంకర యోధులు పోరాడిరి. చివరకు టిటనులు పరాజితులయిరి. జ్యూయసు వీరలనందరను టార్టరసుకు నరక బాధల ననుభవించుటకు పంపెను. బాల దేవతలు విజయ ప్రభచే ప్రకాశింపసాగిరి.

జ్యూయసు తనసోదరులతో తిరిగి తగవులాట రాకుండనుండుటకయి వారికిని రాజ్యము పంచిపెట్టెను. పోసైడను సాగరవల్లభుడయ్యెను. ప్లూటో పాతాళ లోకాధిపత్యము వహించెను. జ్యూయసు భూనభోలోకముల కధిపతియై, సమస్త దేవమానవులను పాలించు ముఖ్యదేవేశ్వర పదవిని వహించెను. అయినను, తన పదవిని ధిక్కరించు వాడెవడైనను లేచునేమోయను భయముతో నతడత్యంత జాగరూకుడయి యుండెను. జ్యూయసుయొక్క శౌర్య పరాక్రమములకును, క్రూరశిక్షా విధానములకును జంకి, ప్లూటో తనకు దొరకిన

పదవితో తృప్తినొంది మెలగెను. కాని పోసైడను మాత్రము రాజపదవిపై కన్ను వేసి యుండెను. జ్యూయసును పదభ్రష్టుని చేయ సంకల్పించి, పోసైడను జూయసుపై తిరుగబడి, యుద్ధము చేసెను. కాని జ్యూయసు పోసైడనును ఓడించెను. జ్యూయసు పోసైడనుకు ఒకానొక మానవులయొద్ద సంవత్సర కాలము సేవచేయునట్లు శిక్ష విధించెను. జ్యూయసు పాలనము శాంతముగా నడువలేదు. టార్టరసు కుమారుడు టైఫోను అను శతశిరస్కుడు తిరుగుబాటు చేసెను. మరియొకసారి యసురులు తిరుగుబాటు చేసిరి. వీరినందరను బాగుగ నాతడు మర్దించెను. టైఫోను అను రాక్షసుని ఎట్నా పర్వతము క్రింద అగ్నికుండములో బంధించెను. అచ్చట భూకంపములు కలుగుచుండుటకు టైఫోను తనమీది పర్వతమును పడద్రోయుటకు కదలుచుండుటయే కారణమని చెప్పెదరు. ఇట్లు శత్రువులనందరను, దునుమాడిన యనంతరమే జ్యూయసుకు నెమ్మది యేర్పడెను. అప్పటినుండి జ్యూయసు దుర్నిరీక్షమానుడయి, శాత్రవ భయంకరుడయి, తన్నెదురించువారు లేక నిరంకుశముగా రాజ్యపాలనము చేయసాగెను. కాని యిప్పటినుండి ఒలింపసు స్వర్ణచరిత్రయంతయు రహస్య తంత్రములకును, నిరంకుశత్వమునకును సంబంధించినదయి, దూషణీయమయి యుండెను.

జ్యూయసు (జ్యుపిటరు) తన సోదరియగు హీరా (జ్యూనో)ను పెండ్లియాడెను. అందుచే హీరాదేవి విశ్వమునకు రాణియయ్యెను. జ్యూయసుకు ఈ మెవలన మార్సు, టాంటలసు,

వల్కానుసు అను ముగ్గురు కొమరులును, హెబీ అను ఒక కూతురు కలిగెను.

జ్యూసును విషయలోలుడు. తనకంటబడిన సౌందర్యవతిని ఆతడు విడువలేదు. దేవతా స్త్రీలలో థేమిసు, డిమెటరు (సోదరియే), మెటిసు, యురెనోసు, నిమోసని మొదలగువారు ఈతనికి భార్యలయిరి. మానవ సుందరులను వశము చేసుకొనుటలో ఇతడు పెక్కుపోకడలు పోయెను. అంతయు మోసపు వ్యవహారమే. మానవ వనితాలోకములో ప్రణయ విహార సందర్భమున ప్రచ్ఛన్న వేషధారియై జ్యూయసు ప్రవర్తించెను. స్వర్ణవర్ష రూపమున డానలుని సమీపించెను. అంటియోపియొద్దకు "అజనర" (Satyr) రూపమున ప్రత్యక్షమయ్యెను. లీడాయొద్దకు హంసరూపమున నేగెను. యూరోపాకు వృషభరూపమున వెళ్ళి ఆమెను ఎత్తుకొనిపోయెను. అల్కామీనాను ఆమెభర్త రూపమున గలిసెను. ఇంకను లాటోనా, ఐయో, ఎకో మొదలగు వనితలు పెక్కుమంది ఈతనికి ప్రియురాండ్రుగా నుండిరి. వీరికందరకు సంతానములు కలిగెను.

హీరాదేవి జ్యూయసు శృంగారపు చేష్టలను కనిపెట్టుచుండెను. సపత్నీ ద్వేషముతో జ్యూయసు ప్రియురాండ్రను పెక్కుబాధలు పెట్టుచుండెడిది. జ్యూయసు భార్యను ఏమియు ననజాలక తనప్రియురాండ్రను రక్షించుచుండుటకు ప్రయత్నించుచు నుండెడివాడు. ప్రియురాండ్రకు జనించిన వారలలో మెర్క్యురి, అపోల్లో, డయానా, మినర్వా, బాకసు ముఖ్యముగా పేర్కొనదగిన దేవాంశ సంభూతులు, దేవతలుగా

పూజింపబడినవారు. హెరక్ల్యులీజును, పోలక్సు, పెర్స, మొదలగువారు మహావీరులయి ప్రఖ్యాతి కెక్కిరి. వీరు స్వర్గలోకములో దేవతలతో సమానముగ అర్ధాసనమున కూర్చుండు నర్హత గలవారయిరి.

జ్యూయసునకు ముందుకాలముస్వర్ణయుగముగా నుండెను. జ్యూయసు కాలప్రారంభమున రజతయుగముగా నుండెను. ఈ యుగమువారు రజత జాతీయులు. ఇప్పటికిని స్వర్ణయుగమునందువలెనే వసంత ఋతువొక్కటియే యుండును. అయినను, జనులు స్వర్ణయుగములోని జనులవలె శిష్టాత్ములు గాక, దుష్టాత్ములయి సదా పోరాడుచుండిరి. ఒలింపసు పర్వతధాములగు బాలదేవతలను పూజింపకుండిరి. జ్యూయసు రాజ్యచక్రమును పూనగనే వారిపయి యాగ్రహించి, మహామారీ వ్యాధులను విశ్వముపయి ప్రయోగించెను. రజత జాతీయులు నాశనమయిపోయిరి.

జ్యూయసు క్రొత్త జాతిని సృష్టించెను. వీరు కంచు జాతీయులని పేర్వడసిరి. వీరు భూమిపై నుద్భవించినప్పుడు పదేండ్ల పరిమితిగల దేవదానవుల యుద్ధము ముగిసెను. ఈ యుద్ధము పెక్కుమార్పులను తెచ్చిపెట్టెను. అప్పుడు నాలుగు ఋతువులు—వసంత, గ్రీష్మ, శరత్, హేమంతములు ఏర్పడెను. ఈ క్రొత్త జాతివారికి రాత్రులందును, హేమంత ఋతువునందును చలిబాధ మిక్కుటమయ్యెను. గ్రీష్మ, శరదృతువులయందు తప్ప మిగత ఋతువులలో వారికాహారపదార్థములు లభింపకుండెను. వారికెట్టియాయుధములును లేకుండెను. దారు, శిలామయములగు కొరముట్లనుపయోగించుచుండిరి. వారికి

ఇండ్లు, వాకిండ్లు లేకుండెను. గుహలలోనో, భూవివరముల లోనో తలలు దాచుకొనుచుండిరి. వారు అజ్ఞానులై సౌఖ్య హీనులై యుండిరి. కంచుజాతీయులగు నీ ప్రజాసమూహము నుద్ధరించుటకై ప్రామెథుసు అను టిటను మిగుల పనిచేసెను. ప్రామెథుసు బోధలవలన ప్రజలు పెక్కుసదుపాయములను నేర్చుకొని సుఖింపసాగిరి.

ప్రామెథుసు చేయుచుండిన మానవసేవా విధానము జ్యూయసుకు రుచింపదయ్యెను. ప్రజలు విజ్ఞానవంతులై ప్రకృతి రహస్యముల నెరిగి తనను మించు శక్తి కలవారగుదురని జ్యూయసు భయపడెను. దేవతలు స్వార్థపరులయి తమయొద్ద నున్న ఉపయుక్త పదార్థములను దెలుపకుండిరి. ఇట్లు ఉపయుక్త పదార్థములలో ముఖ్యమయినది అగ్ని. ప్రామెథుసు స్వర్గము నుండి అగ్నిని దొంగిలించి, కట్టెలో దాచిపెట్టి రహస్యముగా భూమిమీదికి తీసికొనివచ్చి ప్రజల కొసంగెను. ప్రజలాయగ్ని లాభములను బొందుచుండుట జ్యూయసుకు తలకంటకింపుగా నుండెను. ప్రామెథుసును కఠోరశిక్ష పాల్చేసెను. పండోరా యను కన్యామణిని, ఆమెకరణముగా నొక పెట్టెను భూమిపైకి పంపెను. ఈ పేటిక మూలకముగా భూమిపై సమస్త వ్యాధులను, నొప్పులను జ్యూయసు ప్రసరించేసెను.

ప్రామెథుసు ప్రజలపక్షమున వహించి, వారి మేలు కొరకు పడరాని పాట్లు పడుచుండుగ, రాజాదరణమునుబొంది, యేమో జుట్టుకొందమను స్వార్థపరులు ప్రజలలో లేకపో లేదు. ప్రామెథుసు స్వర్గమునుండి యగ్నిని తెచ్చిన రహస్య విషయమును కొందరు జ్యూయసు చెవిలో నూదిరి.

ఆ స్వార్థపరుల రాజభక్తికి మిగుల మెచ్చుకొని జ్యూయసు వారికి స్థిర యౌవనము పంపెదనని సెలవిచ్చెనట! ఆ చాడిగొడుంలు అత్యంతముదితులయిరి.

జ్యూయసు స్థిర యౌవనము ఇచ్చెదనని పలికినను, అట్టి వర మొసంగుట కాతనికి మనసులో నిష్టము లేకుండెను. వర మిచ్చినట్లుండవలెను, వారి కది లభింపకుండా నుండవలయును. కావున, జ్యూయసు "యౌవనము" ను సంచిలోపెట్టి ఆసంచిని గాడిద మూపుపై పెట్టి, యాగాడిదను భూమిమీదికి పంపెను. గాడిద తెలివిమాలిన జంతువనియు, దాని మూపుమీదనుండు ఆ యమూల్యపదార్థమును అది మధ్యేమార్గములో జారవిడుచు ననియు, ఆ దేవుని యూహయయి యుండెను. అదియట్లే జరిగినది.

ఆ గార్దభ మా యౌవన పదార్థ భారమును వహించి స్వర్గమునుండిదిగి భూమికి వచ్చుచుండెను. ఎండలో వచ్చు చుండుటచే నది మిగుల యలసెను. దాహబాధ తీవ్రమయి దాని నాలుక పీకుకొని పోవుచుండెను. అది దప్పి తీర్చుకొను టకై అటునిటు వెదకిచూచి, ఒక మడుగు దగ్గరకువచ్చి నీరు త్రాగుటకు ప్రయత్నించెను. ఆ నీటిలో నొక పాముండి దానిని నీరు త్రాగకుండ నదలించెను. గార్దభ మాసర్పమును పెక్కు విధముల ప్రార్థించెను. దాని మూపుమీదనున్న పదార్థమును తనకిచ్చినచో నీరు త్రాగనిచ్చెదనని సర్పము గాడిదతో బేరమాడెను. గార్దభము తన దప్పి తీర్చుకొనుటకు వేరు ఉపాయముగానక ఆ యౌవనపదార్థమును సర్పమున కిచ్చివేసి దప్పిక తీర్చుకొనెను. ఈ పదార్థము మూలకముననే

సర్పములు కుబుసములు విడచి నూతన యౌవనమును పొందుచున్నవట! తాము చేసిన ఘనకార్యమునకై జ్యూయసు తమకు దివ్యఫలము ప్రసాదించునని అత్యంతాశాబద్ధులై యున్న రాజభక్తుల నోటిలో దుమ్ముపడ్డది.

జ్యూయసు న్యాయము చేయుటకో, విచారణ గావించుటకో భూమిమీదికి వచ్చుచుండెడివాడు. ఈతని కార్యములలో ఫిలెమోను, బాసిసులా కథనము సుందరమయినది. విక్సాను కథనము భయంకరమయినది. సాల్మోనియను కథనము దైవశిక్షణకు తార్కాణము.

జ్యూయసు మహోన్నతాకారుడు. పెద్దగడ్డము కలవాడు. ఉంగరాల వెంట్రుకలు, ఓ పత్రాలంకారమగు కిరీటము గలవాడు. చేతులలో వజ్రాయుధము (Thunderbolt) ఉండును. ఈ ఆయుధములో అపచారులను దండించును. ఒక గరుడపక్షి సదా యతనిని సేవించుచు ఆతని ఆజ్ఞలను నిర్వహించుచుండును. ఇతనికి పానపాత్రినందించువాడు గానెమీడు, అను మానవ సుందరుడు. కూతురగు హింబీ కన్యయు పానపాత్రిధారిణిగా నుండెను.

సామాన్య మానవులు పూజించునిమిత్తము జ్యూయసు విగ్రిహములు పెక్కునిర్మాణములయ్యెను. ఈ విగ్రహములలో ఫిడియాసు శిల్పి చిత్రిత విగ్రహము మహోన్నతమయినది, ఈ విగ్రహము నలుబదియడుగుల యెత్తుగలది. బంగారు, దంతము మయమయి, ప్రాచీన ప్రపంచములోని సప్తవిచిత్రిములలో నొక్కటిగా ప్రఖ్యాతి చెందెను.

ఈ దేవుని యర్చనా పీఠముగా ప్రాముఖ్యమును వహించిన ఒలింపయాలోని దివ్యమందిరములో నీ విగ్రహము ప్రతిష్ఠితమయ్యెను. ఈవిగ్రహమును క్రీ. శ. మూడవశతాబములో కాన్‌స్టాంటునోపులుకు తరలించిరి. అచ్చట నది క్రీ. శ. 476లో అగ్నిప్రమాదమున నాశనమయ్యెను.

జ్యూయసు దేవుని వాక్యము వినుపించు స్థానములలో డోడోనా ఇంతకు పూర్వముండెను. భవిష్యద్వాక్యము వినుపించు ఈ దేవుని పీఠములలో లిబియాప్రాంతపు ఎడారులలో నొకటియుండెను. ఇదియును ప్రసిద్ధి చెందినదే. ఇచ్చట నీ దేవుడు జ్యుపిటరు అమ్మోన్ అనుపేరు వహించెను. ఇచ్చట నీ దేవుడు ఈజిప్టుదేశ సాంప్రదాయానుసారము శృంగసహితుడయ్యెను.



# రోము నగరము

## శ్రీ బి. వెంకట సుబ్బారావు

రోము ఇటలీ దేశముయొక్క రాజధాని. ఇది కొన్ని వందల సంవత్సరములు రోమన్ సామ్రాజ్యమునకు కేంద్రముగా నుండినది. ఆ కాలమందలి సామ్రాజ్యములలో కెల్ల రోమన్ సామ్రాజ్యమే గొప్పది. విజేతలగు రోమన్ సైనికులు ఇంగ్లండును కూడా జయించిరి. మధ్యధరా సముద్రపుటొడ్డున గల ఆఫ్రికా ప్రదేశములందు కూడా వారు తమ అధికారమును స్థాపించిరి. పాలస్తీనా, టర్కీలు, వీరి అధికారము క్రిందకి వచ్చినవి. రోమనులచే చేయబడిన శాసనములు ప్రపంచమునందు గణుతికెక్కెను. విద్య మరియు కళ యందు అద్వితీయమైన ఉన్నతిని సాధించిరి. వారు రోడ్లువేయుట యందును, భవనములు కట్టుటయందును చాలా నిపుణులుగా నుండెడివారు. వారిచే కట్టబడిన భవనములయొక్క భగ్నావశేషములను చూచి ఈనాటి ప్రజలు ఆశ్చర్య చకితులగుచున్నారు. సీజర్, ఆగస్టస్, కాన్‌స్టంటాయిన్, మొదలగువారు చక్రవర్తులై రోమను సామ్రాజ్యమును పాలించిరి. వీరి కాలమునకు క్రైస్తవమతము ఆరంభము కాలేదు. వీరు యూనాన్ దేశీయులవలె దేవతాపూజలు చేయుచుండిరి. రోము నగరమందల ఒక మందిరమునందు అన్ని వేళల అగ్నిని ప్రజ్వరిల్ల చేయుచుండిరి. ఆ అగ్నిని ప్రజ్వరిల్ల చేయుటకై

బ్రహ్మచారిణులగు దేవదాసీలు నియమింప బడెడివారు. ప్రపంచమందలి సంపత్తి యంతయు రోముకు వచ్చుచుండెడిది. ప్రపంచములోని ఆ కాలపు నగరములన్నిటికెల్ల రోము కేంద్ర ముగా నుండెను.

# ప్రాచీన రోము నగర స్థాపన

రోమునగర స్థాపనను గురించి విచిత్రమైన ఒక గాథ కలదు. ఈ రోజు రోమునగరమున్న ప్రదేశ మొక రాజు యొక్క రాజ్యములో నుండెను. తమ్ముడు ఆ రాజును సంహ రించి సింహాసన మాక్రమించెను. అంతటితో తనివి జెందక అన్న కుమారుని హతమార్చి కుమార్తెను బలవంతముగా మందిరమునందు దేవదాసీగా నియమించెను. ఆమె కొలది రోజులకు కవలపిల్లలను ప్రసవించెను. ఆనాటి రాజశాసనము దేవదాసీలు బ్రహ్మచర్య వ్రతభ్రష్టులైన ప్రాణములతో భూమియందు పాతిపెట్టవలయునని యుండెను. శాసనప్రకారము ఆమెను భూమిలో పాతించెను. ఆ యిద్దరి పిల్లలను "టాయిబర్" నదియందు పారవేయించెను. విధివశమున ఆ బాలకులు ఒడ్డు చేరిరి. అకస్మాత్తుగా ఆ ప్రదేశమునకు ఒక ఆడ నక్క వచ్చెను. ఆ అనాథబాలకులు ఆకలిచే దాని పాలు ద్రావిరి. ఆ సమయమందొక పశువుల కాపరి వారిని చూచి తన యింటికి తీసుకొని యేగెను. ఈ బాలకులు "రోములస్, రీమస్" అను పేర్లచే పిలువబడిరి. ఇందు రోములస్ యుక్త వయస్కుడైన తదుపరి తన పినతండ్రిని జయించి రాజ్యము

నాక్రమించెను. వెంటనే తాను బాల్యమునందు నదినుండి ఎక్కడ ఒడ్డు చేరియుండెనో ఆప్రదేశము నందొక నగరమును నిర్మించెను. క్రీస్తుశకము 765 సంవత్సరములకు పూర్వమే ఈ నగరము నిర్మింపబడెను. ఇచ్చట ఏడు చిన్న చిన్న పర్వతము లున్నవి. కొలది సమయమునందే పట్టణము ఈయేడు పర్వతముల ప్రదేశమునంతను ఆక్రమించెను. రోమలస్ చే నిర్మింపబడుటచే ఈ నగరమునకు "రోమ్" అను నామము ప్రసిద్ధమయ్యెను. పై కథయొక్క కారణమువల్ల ఈనాటి వరకు ఆ నగరమందొక నక్కను పెంచెదరు. దానిని ప్రజలు నగరముయొక్క మంగళ చిహ్నముగా భావింతురు. అభిమానులు ఫాసిస్టులునగు రోమనులు తమ్ము ప్రజలు గోమాయువు యొక్క పుత్రులు అని పిలిచినచో గర్వింతురు. భారతీయులు, గంగానదిని యెటుల గౌరవింతురో రోమన్ ప్రజలు "టాయిబర్" నదిని అంత పవిత్రముగా భావింతురు.

ఈ విధముగా రోము 2700 సంవత్సరముల పురాతన నగరమై యున్నది. ఈ యిరువదియేడు శతాబ్దములలో యెన్నియో మార్పులు కలిగినవి. కేవలము రోము నగరమే గాక ఇటలీ దేశమంతయు ఎన్నియో మార్పులను చెంది ఈనాడు ప్రాచ్య పాశ్చాత్య సభ్యతలతో క్రైస్తవమతముతో నిండియున్నది. పురాతన భవనములు కూలిపోయినవి. వాటి పునాదులపైననే క్రొత్తభవనములు నిర్మింపబడినవి. రాజకీయ పరిణామములవల్ల ప్రజలు ప్రాచీన నగరమును విడుచుటచే నది కాలగర్భమున కలిసిపోయినది. నాలుగయిదు శతాబ్దములలో ప్రజలు ప్రాచీన నగరముయొక్క అస్తిత్వమునే

మరచిరి. ఈనాటి రోమునగరము ప్రాచీన నగరముయొక్క భగ్నావశేషములపై కట్టబడినదే. రోమునగర ప్రాచీన ఔన్నత్యమును తెలుసుకొనుటకు మూడు మార్గములు కలవు. వీనివల్ల పాఠకులకు రోముయొక్క ప్రాచీన ఇతిహాసము తెలియ గలదు. ప్రథమ రోము నగరము పౌరాణికమైనది. ఇందు క్రైస్తవమతము వ్యాపించని కాలమునాటి రోమక సామ్రాజ్యపు చిహ్నములున్నవి. ఇవి చాలావరకు బయటకు తీయ బడినవి. వీనియందు రెండు మూడు ప్రాచీన చిహ్నములు ఉల్లేఖనీయములై యున్నవి. "కులీసియమ్" అను భవనము మనలను మొదట ఆకర్షించును. ఇది నాలుగు అంతస్థులు కలిగి విశాలముగా గుండ్రముగా నున్నది. దీనిగోడలు రెండు వేల సంవత్సరములకు పూర్వమే కట్టబడినను ఈనాటివరకు చెక్కుచెదరక నిలచియున్నవి. సామాన్యముగా ప్రపంచములో కెల్ల ఈ భవనమే చిత్రమై సుందరముగా నున్నది. వాస్తవములో నిది వ్యాయామ ప్రదర్శనశాలగా నుండినది. ఇందు మధ్యభాగమున విశాలమగు వర్తులాకార ప్రదేశముకలదు. ఈ స్థలమందు ఆఫ్రికా దేశమంగలి సింహమును తెచ్చి విడుచు చుండిరి. మృత్యుదండన విధింపబడినవారు ఆ సింహముచే పోట్లాడవలసి యుండును. వీరిని "గ్లెడియేటర్" అని పిలిచెడి వారు. వారిలో అధికులు క్రైస్తవులై యుండిరి.

ఆ దృశ్యమునుచూచుటకై నగరమందలి ధనవంతులు, నాగరికులు గుంపులుగా ఆ ప్రదేశమందు కూడుచుండిరి. కులీసియమ్ తరువాత రెండవది ఫోరమ్. ఈ ప్రదేశము రోము నాగరిక ప్రజల కేంద్రముగా నుండినది. ఇచ్చట

నాగరికులందరు కూడి నగర, దేశ, పరిస్థితులను గురించి ఆలోచించెడివారు. అప్పుడు నిర్మింపబడిన వేదిక ఇంకను భద్రముగా నిలిచియున్నది. ఆ వేదిక పై నిలిచి అసాధారణ విషయములపై రోమువక్తలు, నాగరికులు, నగరముఖ్యులకు తెల్పెడివారు. వారిలో పలువురు వక్తలను ప్రపంచమునందద్వితీయులనుగా ఎన్నుచున్నారు. వీరి అద్వితీయమైన ప్రసంగమువల్ల అసాధారణ రాజకీయ పరిస్థితులు సవరింపబడుటతో మారుటతో జరిగెడివి. ఇచ్చట పాలకులు పాలితులు దేశమునకు సంబంధించిన విషయములపై తమతమ అభిప్రాయములను వెల్లడించి ఉత్తమ నిర్ణయములను చేసెడివారు. ఫోరమునందు అన్నితరగతుల ప్రజలకు వారివారి అభిప్రాయములను ప్రకటించు స్వాతంత్ర్యముండినది. ఈ నాడు కేవలము ఫోరము యొక్క పునాదులు మాత్రము నిలిచియున్నవి. దాని సమీపమునందే సీజర్ (రోముచక్రవర్తి) యొక్క భవనము కలదు. ఈ భవనము చాలా చిన్నదిగా యున్నది. సీజర్ చక్రవర్తి యొక్క అంతటి చిన్నభవనమును చూచి ప్రజలు ఆశ్చర్య పడుదురు. దీనిసమీపమునందే మతాచార్యులయొక్కయు దేవదాసీలయొక్కయు భవనముల అవశేషములున్నవి. ఫోరమ్ మధ్యప్రదేశమందు యిటికలతో కట్టబడిన స్తంభముకలదు. దీనిని ప్రపంచనాభియందురు. రోమునగరమునుండి ఇంగ్లండు, ఫ్రాన్సు జర్మనీ, స్పైన్, గ్రీస్, పాలస్తీనా మొదలగు దేశములకు పోవుమార్గములన్నియు ఈ స్తంభమునుండి కొలవబడుచుండెడివి. ఈ విధముగా "అన్ని మార్గములు రోమునగరమునకు పోవును" అనునానుడి ఆరంభమైనది. ఫోరమ్‌నకు

ఎదురుగా పవిత్రియవియ వియా వేపియన్ అనియు వ్యవహరింపబడు పథముకలదు. ఈమార్గము కిరు పార్శ్వములందును ప్రాచీనమందిరములయు, సమాధులయు భగ్నావశేషము లున్నవి. అడుగడుగునకు విజయస్మారక ద్వారములు కట్టబడి యున్నవి. వీనిలో ఆగష్టస్, టాయిటస్, కాన్స్టంటాయిన్, గొయొక్క విజయద్వారములు ప్రసిద్ధిజెందినవి. రోమన్ ప్రజలకు జలక్రీడయందును, స్నానమందును చాలా అభిరుచియుండినది. వారిచే కట్టబడిన స్నానపుగదులు ప్రాచీన రోమునందు కన బడుచున్నవి. నగరమునకు చిన్న చిన్న కాలవలద్వారా నీరు విడువబడుచుండెడిది. నదులపై, కాలువలపై కట్టబడిన వంతెనలు వేల సంవత్సరములు గడచినను సురక్షితముగా నున్నవి. ఇచ్చట పూర్వపు రోమన్ చక్రవర్తుల సమాధులున్నవి. ఈ సమాధులలోకోట హెడ్రియన్ ప్రసిద్ధిచెందినది. ప్రాచీన రోమమందిరములు క్రైస్తవమతానుయాయులచే ప్రార్థనా మందిరములుగా మార్చబడినవి. భవనముల ముందుభాగము లందు ఎత్తైన చలువరాతి స్తంభములు కట్టబడినవి. ఇవి చూచుటకు అందముగా నుండును.

## క్రైస్తవ రోమునగరము

చివరకు రోమన్ ప్రజలు క్రైస్తవమతమును స్వీకరించిరి. ఎన్నియో ప్రాచీన మందిరములను ప్రార్థనామందిరములుగా మార్చిరి. ఎందరో చక్రవర్తులు క్రొత్తక్రొత్త ప్రార్థనామందిరములను నిర్మించిరి. ఏసు మహాత్మునకు పండ్రెండుగురు శిష్యులుండిరి. స్వర్గద్వారముల తాళపుచెవి మహాత్ము

డగు పీటర్‌నకు యివ్వఁబడినదనియు, అందరిలో ప్రధానశిష్యు డితడేయనియు భావించుచుండిరి. ఏసు తరువాత పీటర్ క్రైస్తవమతాచార్యుడయ్యెను. పీటర్ క్రైస్తవ మతాచార్యు డగునప్పటికి ప్రజలు క్రైస్తవమతము స్వీకరించలేదు. అందు వలన పీటరును కారాగారమందునిచి నానాబాధలిడిరి. ఇనుప సంకెళ్ళతో బంధించి అంత్యమున నిండుప్రాణములతో కాల్చిరి. అనంతరము పీటర్ శిష్యుని క్రైస్తవమతాచార్యు నిగా అంగీకరించి 'పోప్' [క్రైస్తవ మతాచార్యులందరికంటెను గొప్పవాడు] అను బిరుదమునిచ్చిరి. తరువాతి కాలమందు ఆ పీఠ మలంకరించిన మతాచార్యులందరికిని 'పోప్' అను ఉపాధి యియ్యఁబడినది. చాలాకాలమువరకు వీరి అధికారము క్రైస్తవ ప్రపంచమునందు అమోఘముగా నిలిచి యుండినది. కడకు జర్మనీయందు 'మార్టిన్ లూథర్' "ప్రొటెస్టంట్" అను శాఖను ఏర్పరచి సంస్కరించెను. పూర్వసాంప్రదాయ ముల ననుసరించు పోపువర్గమునకు రోమన్ 'కేథలిక్' అను పేరుకలిగెను. ఈ నాడు ఇటలీ, ఆస్ట్రేలియా, దక్షిణ జర్మనీ, ఫ్రాన్స్, స్పైన్, పోర్చుగల్, ఐర్లండు, దక్షిణ అమెరికా మెక్సికో, దేశములందు రోమన్ కేథలిక్కులు అధిక సంఖ్యా కులుగా నున్నారు. అమెరికా, కెనడా, ఇంగ్లండు దేశములందు వీరు అల్పసంఖ్యాకులు కావుననే ప్రపంచముపై రోముపోపు లదే ఎక్కువ ప్రభావమున్నది. రోము పోపులు ఇటలీ మరియు దాని చుట్టుపట్టు ప్రదేశములందు తమ అధికార మును స్థాపించిరి. ఉత్తర ఇటలీలో ఆస్ట్రియా రాజ్య

ముండినది. ఇటలీయందు స్వాతంత్ర్యాభిలాష హెచ్చెను. తమ దేశమునుండి విదేశీయుల పారద్రోలి ఏకచ్ఛత్రాధిపత్యము క్రిందకు తెచ్చుటకై మెజినీ, గెరిబాల్డీ, కేవూర్, రాజావిక్టర్, యిమాన్యుఆల్, మొదలగువారు బద్ధకంకణులైరి. క్రీ. శ. 1870 సంవత్సరము నందు గెరిబాల్డీ ప్రజాసైనిక నాయకుడై రోమును ఆక్రమించెను. దానిని ఇటలీ దేశ రాజధానిగా చేసెను. పోపు తన మహలునకు వెడలిపోయెను. పోపు ఇటాలియన్ అధికారమును ఒప్పుకొనలేదు ప్రపంచమందలి రోమన్ కేథలిక్కులందరు పోప్‌ను చాలా అభిమానించుచుండిరి. కడకు ఇటలీ ప్రభుత్వము కూడా ఆయనపై ఎక్కువ నిర్బంధములుంచుటకు సంకోచించుచుండెను. ఈ కారణమువలన పోప్ యొక్క స్వాతంత్ర్యము నిలచెను. అమెరికా, ఇంగ్లండు, జర్మనీ మొదలగు దేశములు పోపు యొక్క స్వాతంత్ర్యమును గుర్తించినవి. పోపు ఆయాదేశములందు తన రాయబారులనుకూడా నియమించెను; రోము నగరమందు పోపు అధికారము క్రిందనున్న భాగమును 'వైటికన్' అని పిలుతురు.

వైటికన్ యందు పోపుయొక్క భవనమున్ను ప్రపంచ ప్రసిద్ధిచెందిన గ్రంథాలయమున్ను కలవు. ఈ గ్రంథాలయము నందు కేవలము గ్రంథములేగాక ప్రసిద్ధ చిత్రములు, కళాఖండములు, భద్రపరుపబడినవి. మరియు రోమన్ కేథలిక్కు [illegible] కొందెను పవిత్ర ప్రార్థనా మందిరముగ భావించు [illegible] టుపీటరు మందిరము ఇందేయున్నది. ఇదె [illegible] [illegible] ప్రపంచ [illegible] మందిరము [illegible] గొప్ప[illegible]

దీని లోపలిభాగము చాలా సుందరముగా నున్నది. దీనిపై కట్టబడిన శిఖరము చాలా ఎత్తుగాను సుందరముగాను నున్నది. మందిరమున కెదుట "సెంటుపీటర్" చతుష్పథము కలదు. దీనికి నాలుగు వైపులా అంగడులు కలవు. "సెయింటుపీటర్" తరువాత "పెంథియన్" మందిరము చాలా ప్రసిద్ధి చెందినది. ఈ మందిరము క్రైస్తవమత వ్యాప్తి చెందక పూర్వము "సప్తగ్రహ" మందిరముగా నుండినది. రోముయొక్క పౌరాణిక యుగచిహ్నముగా ఈనాటివరకు శిథిలముచెందక నిలచియున్నది "పెంథియన్" మందిర మొక్కటే! ఇందు ప్రసిద్ధ చిత్రకారుడగు "రఫైల్" సమాధి యున్నది. రోమునందు క్రైస్తవ ప్రార్థనా మందిరములు అసంఖ్యాకముగా నున్నవి. వీటియందు ఏసుక్రీస్తు, మరియమ్మ, క్రైస్తవ మతాచార్యులయొక్క విగ్రహములు చిత్రపటములు కలవు. వీరి పూజకూడా చాలా గొప్పగా జరుగును.

వైటికన్ యందు ఇటలీ రాజాధికారము లేదు. పోపునకు కొందరు సైనికులు గలరు. వీరిని "స్విస్ గార్డ్స్" అని పిలుతురు. వీరిలో అధికులు స్విర్జర్లాండు దేశీయులు. స్విస్ గార్డ్సుయొక్క సైనిక దుస్తులు పూర్వపద్ధతిలో నున్నవి. యుద్ధకాలమందు ఎటువంటి పరిస్థితిలోకూడా "వైటికన్"పై బాంబులు వేయకూడదని కఠినముగా ఆజ్ఞాపింపబడియుండెను.

## ఆధునిక రోమునగరము

ఈనాడు రోమునగరము పౌరాణిక క్రైస్తవ యుగ శిథిలావశేషములపై కట్టబడియున్నది. ప్రాచీనావశేషములు

నగరమునందు ఎక్కువగా ఎక్కడచూచినను కనపడును. ఈనాడు రోము అర్వాచీనసభ్యతతో నిండియున్నది. నగరమునందు గొప్ప యంత్రశాలలు నిర్మింపబడుచున్నవి. ట్రాములు, మోటారులు, మొదలగునవి తిరుగుటకై మార్గములు విస్తారము చేయబడినవి ఇచ్చట ఇటలీప్రభుత్వము యొక్కయు, విదేశ రాయబారులయొక్కయు కార్యాలయములు కలవు. రోము ఇటలీ దేశముయొక్క గొప్ప రైల్వే కేంద్రముగా నున్నది. స్వాతంత్ర్యప్రాప్తి తరువాత ఇటలీ ఏకచ్ఛత్రాధిపతియగు విక్టర్ యిమాన్యుఅల్ యొక్క స్మారక చిహ్నము తెల్లని చలవరాళ్ళతో కట్టబడి యున్నది. ఇంత సుందరముగా కట్టబడిన స్మారకచిహ్నము ప్రపంచమునందిది యొక్కటియే! దీనియొక్క విశాల నిర్మాణము దర్శకులను త్వరలో ఆకర్షించును.

ప్రపంచ ప్రాచీన నగరములలో రోము నగరమొకటి. మన భారతభూమియందు కాశీ, పాట్నా, ఢిల్లీ మొదలగు ప్రాచీన ఇతిహాసమును తెల్పునగరములున్నవి. కాని యూరపు ఖండమునందు రోముకంటెను ప్రాచీన నగరములు చాలా తక్కువగా నున్నవి. ప్రాచీన చిహ్నములు ఢిల్లీ, కాశీ, పాట్నా మొదలగువాటి యందలికంటెను రోమునందు ఎక్కువగా నున్నవి. ప్రపంచమునందు రోమువంటి ప్రాచీన చారిత్రక వైభవమును నిరూపించు విశేషభగ్నావశేషములు మిగిలిన మహానగరములు చాలా తక్కువగా ఉన్నవి.

---

10328

